# తెనుఁగుసీమ

రచయిత
"ఉభయభాషాప్రవీణ"
జంధ్యాల పాపయ్యశాస్త్రి

(పరిష్కృత పరివర్తిత సంస్కరణము)




జయలక్ష్మి అండ్ కంపెని
రిజిష్టర్డ్ ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు
నెల్లూరు

 [వెల రూ. 1-0-0

నవ్య ముద్రణము

Revised & Enlarged

Kokila Press, Nellore.

# అనుక్రమణిక

# ఉపక్రమణిక

ఆంధ్రమాత సకలశ్రీ సముపేత; దిగంత యశోవిరాజిత; అనూన విజ్ఞాన శోభాసమలంకృత; పూతచరిత అజిత.

కడుపు చల్లగ ఆమె గంపెడు బిడ్డల గన్నది. రాజాధిరాజులకు పురుడు పోసినది. వీరనారీమతల్లులకు ఉగ్గుపెట్టినది. వెన్నుచూపని వీరయోధులకు పాలిచ్చినది. మహామంత్రులకు మాటలు నేర్పినది. కవిశిఖామణులకు నడకలు దిద్దినది. ఆమె పచ్చిబాలెంతరాలు. వేదకాలము నాటి ముత్తైదువ.

ఒకనాడామెయింట రత్నాలు కొలిచినారు. ఆమె నాగరికత తూరుపు లంకలకు వలసపోయినది — పడమటి దేశాలకు పరుగులెత్తినది. ఆమె విజయధ్వజాలు భారతవినీల గగనభాగమున నాట్యమాడినవి. ఆమె సాహితి అందఱికి కన్నెఱ్ఱి.

ఈనాడామెకు ఇల్లులేదు – వాకిలిలేదు. ఇతరుల పంచలో దలదాచుకొన్నది. ఆమె బిడ్డలు తలకొకదారి; పూటకొక వేషము – నోటికొక మాట. ఆమెబ్రతుకు కుక్కలు చింపిన విస్తరి.

ఆమె నేడు అన్నివిధాల నిఱుపేద; అస్వతంత్ర; అవమానగ్రస్త; ఆర్త. ఆమెబిడ్డలు కనులు దెఱచినారు. తల్లి

చైతన్యమును గుర్తించినారు. స్వతంత్ర సౌధ నిర్మాణము నకు ముందడుగు వేసినారు. తెనుగుసీమయెల్లకడల దట్టముగా గ్రమ్ముకొన్న చిరదాస్య మేఘములు ఇంక స్వాతంత్ర్య వాతోద్ధూతములు కాగలవు. మాసిపోయిన యశఃప్రభలు మఱల దిగంతముల మెఱయింపగలవు.

మా శాస్త్రిగారి 'తెనుగుసీమ' ఈ మహాపర్వమునకు ప్రారంభ సీమ. తెలుగువిద్యార్థులు కళాకాంతులులేని నేటి తెనుగుసీమను వదలి సర్వకళాప్రపూర్ణమగు శ్రీ శాస్త్రిగారి 'తెనుగుసీమ'లో స్థిరనివాస మేర్పఱచుకొనవలెను. అప్పుడే వారు ఖడ్గతిక్కన కత్తిసాములు నేర్చుకొని, రుద్రమదేవి అందిచ్చిన వీరపాయసమును త్రావి, పోతన కవిచంద్రుడు ప్రసాదించిన మధురకవితా జ్యోత్స్నలో మేనులు మఱచి విహరింపగలరు. ఆ నాడే తెనుగుసీమకు నూతనశోభ.

శ్రీ శాస్త్రిగారు ఆధునికాంధ్ర కవితాప్రపంచమున అందె వేసిన చేయి. వారి 'ఉదయశ్రీ' నవ్యకవితాపద్మినీ కుమారికలకు కళోదయశ్రీ. వారి 'విజయశ్రీ' స్వాతంత్ర్యసమర వీరకుమారులకు విజయశ్రీ. మధుర రచనలో మంజులశైలిలో వారికి వారే సాటి. వారి 'తెనుగుసీమ' తెలుగు వెలుగులకు నిలయమగుగాక!

అమరావతి,
**24-10-47.**

—మహావాది వేంకటరత్నము.

'కళాప్రపూర్ణ' శతావధాని

## బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు

మీ తెనుఁగుసీమ సర్వవిధముల విద్యార్థుల నుద్ధరించు గుణములతో నలరారుచున్నది. ఇది సూత్రప్రాయమగు నా యభిప్రాయము. —చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి

అభినవతిక్కనేతి విశ్రుతులు, 'సాహిత్యస్థాపక' 'మహోపాధ్యాయ' బిరుదాంకితులు విమర్శ విద్యా స్వతంత్రులు

## బ్రహ్మశ్రీ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు

"పాఠకుని మైమఱపించి కథలో లీనముగావించు శక్తికలదు శాస్త్రులవారి రచనకు. ఈ పుస్తకము ఆంధ్ర విద్యార్థులు అవశ్యము చదువఁదగినది.

—దుర్భా సుబ్రహ్మణ్యశర్మ

## ఆంధ్రప్రభ

గ్రంథకర్త శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు ఆధునికాంధ్ర కవితాప్రపంచమున ఉదయశ్రీ, కరుణశ్రీ, విజయశ్రీ వగైరా కావ్యములను రచించి వాసికెక్కినవారు.

"తెలుగు జోదుల పరాక్రమమును దిగంతవిశ్రాంత ముగా చాటిన ఖడ్గతిక్కన, రుద్రమదేవి గాథలను, ఆంధ్ర మహాభాగవతమును మందారమకరంద మాధుర్యముగా రచించి పేరుగన్న మహాకవి "పోతన" జీవితచరిత్రను చేర్చి శ్రీ శాస్త్రిగారు ఈ "తెనుఁగుసీమ"ను వెలయింపఁ జేసినారు. చక్కని గ్రాంథికాంధ్రమున మధురగంభీరమగు శైలిలో రచింపఁబడిన ఈ పుస్తకము విద్యార్థులకు అవశ్య పఠనీయము."

## All India Radio, Madras.

× × × "ఉత్సాహాన్ని పుట్టించి, చల్లారిపోయి, గడ్డకట్టిన తెనుగు రక్తాన్ని వేడెక్కించి, పరుగులెత్తించే పుస్తకాలలో జంధ్యాల పాపయ్యశాస్త్రిగారు రచించిన "తెనుఁగుసీమ" ఒకటి. దీనిని నెల్లూరు జయలక్ష్మి కంపెనివారు ప్రచురించారు. వెల ఒకరూపాయ మాత్రమే. కాని ఇందులోఉన్న మూడుకథలూ వెలలేనివి."

× × × "శాస్త్రిగారి రచనలో విశేష మేమంటే ప్రతికథను, చిన్నప్రకరణాలుగ విభజించి ఒక్కొక్క ప్రకరణములో ఒక్కొక్క విచిత్రాంశాన్ని ఇంపుగా వర్ణించి, నవలలాగ సొంపుగా వ్రాశారు. శైలి బహు మధురంగాను, ఉత్సాహపూరితంగాను ఉండి పూర్వపు ఆంధ్రశోభ ఈ కథలలో చక్కగా ప్రదర్శింపబడ్డది. ఆంధ్రజాతీయ పునరుద్ధారణ కార్యక్రమానికి ప్రోత్సాహం కలిగించే పుస్తక మిది. తప్పక చదువతగినది."

By the kind courtesy of 'All India Radio', Madras.

---

## Indian Republic

"Tenugu Seema" portrays in a vivid and graphic manner the lives of three great Andhras, a Warrior, a Woman and a Poet, as models worthy of emulation by Andhra Children.

**Thus the life histories of 'Khadga Thikkana', 'Rudrama Devi' and 'Pothana' are narrated through the pages of the book in chaste and elegant Telugu. This book makes interesting reading for the young and the old.**

# ఖడ్గ తిక్కన

## ౧

ఆనాఁడు విక్రమసింహపుర మంతయును నవ్యకాంతులతోఁ నయనానందకరముగ విరాజిల్లుచుండెను. పురజనులందఱు మహోత్సాహముతో గుంపులు గుంపులుగా రాజమందిరమువైపునకుఁ బోవుచుండిరి. పచ్చపచ్చని మామిడాకు తోరణములతో భవనద్వారములు జయలక్ష్మీ నివాసములై విలసిల్లుచుండెను. రాజసభామంటపమంతయుఁ బ్రేక్షకజన సమూహముతోఁ గిటకిట లాడుచుండెను. విజయదుందుభి ధ్వానములు వీనులవిందుగ వినుపించుచుండెను.

మహాసభామధ్యమున మనుమసిద్ధిమహారాజు తళతళ మెఱయుచున్న నానావిధ భూషణములను ధరించి మణిమయ సింహాసనముపై నాసీనుఁడై యుండెను. ఎడనెడ సేనానాయకులు, దండనాథులు, సామంతులు తమతమ యాసనములపై నలరారుచుండిరి. వెనుకభాగమున నంతఃపుర కాంతామణులు యథోచితస్థానములఁ గూర్చుండియుండిరి.

మనుమసిద్ధి మహీకాంతుని ప్రధానామాత్యుఁడును, ప్రధాన సేనానాయకుఁడును నగు సిద్ధనామాత్యుఁడు మహారాజు ప్రక్కనున్న పచ్చలగద్దియపై నుపవిష్టుఁడై యుండెను. సిద్ధనామాత్యున కుభయపార్శ్వముల నిరువురు యువకులు సూర్యచంద్రులవలెఁ బ్రకాశించుచుఁ గూర్చుండియుండిరి. ఆ నవయౌవను లిరువురు నెవ్వరై యుందురో!

మంగళవాద్యములు మ్రోగినవి. వందిమాగధుల కైవారములు పూర్తియైనవి. భట్టారకుల జయజయధ్వనులు మిన్నుముట్టినవి. వేదవేదాంగవేత్తలగు బ్రాహ్మణోత్తముల స్వస్తివాచనములు ముగిసినవి.

మహామంత్రి సిద్ధనామాత్యుఁడు మెల్లగాలేచి నిలఁబడినాఁడు. మహారాజువైపును, సభాసదులవైపును సాదర వీక్షణములతో నొక్కమారు చూచి గంభీర కంఠస్వరముతో నీ విధముగ నుపన్యసించినాఁడు.

“మహామహులారా! సింహపుర నివాసులారా! సహృదయులగు మీరందఱు సభాభవనము నలంకరించి యున్నారు. నేఁడు మీయందఱ సన్నిధానమున నొక చిన్న విషయమును విన్నవించుకొనుచున్నాను. నేను పెక్కు సంవత్సరములనుండి మనుమసిద్ధిమహారాజుగారి జనకులగు తిక్కనృపాలునకు మంత్రినై సింహపుర రాజ్యలక్ష్మికి నా యోపినంత సేవగావించితిని.

తేజోవిరాజితుఁడగు తిక్కనృపాలుని శౌర్యధైర్య సాహసములు మీ రెఱుంగనివి గావు. ఆ మహారాజు చల్లని పరిపాలనమునఁ గడుపులో చల్ల గదలకుండ మన మెన్నో దినములు సుఖజీవనము గడపితిమి. మహావీరుఁడగు తిక్క భూపతి శత్రువ్యూహములను ఛిన్నభిన్న మొనరించి రాజరాజచోళునిఁ గాంచీపుర సింహాసనాసీనుంగావించి “చోళ సింహాసనస్థాపనాచార్య” బిరుదమును గ్రహించినాఁడు. అంతియ కాక, నిరుపమానశక్తిసామర్థ్యములతో ననేక యుద్ధములందు విజయలక్ష్మి నందుకొని యీ విక్రమసింహ

ష్ట్రమును ప్రజారంజకముగాఁ బెక్కుదినములు పరిపాలించి తన కుమారరత్నమగు ఈ మనుమసిద్ధి మహీపాలుని సింహాసనాసీనుం జేసి కాలధర్మము నొందినాఁడు.

నాఁటినుండియు నేఁటివఱకు నీ సింహపుర రాజ్యమునకు నేనే మహామంత్రినై, ప్రధాన సేనానాయకుఁడనై రాజకార్యముల నడపించుచుంటిని. నాయనలారా! నేను వృద్ధుఁడనై పోతిని. శరీరమున జవసత్త్వము లుడిగిపోయినవి. మేధాశక్తి క్షీణించిపోయినది. మన మహారాజు చిన్నవాఁడు; సామంతరాజులలో సర్వత్ర తిరుగుబాటు సూచనలు కానుపించుచున్నవి. మన పూర్వవిరోధులు సమయమును గనిపెట్టి మన రాజధానిపై దండెత్తి మన రాజ్యమును గబళింపఁ జూచుచున్నారు. ఈ కల్లోలసమయములో మన సామ్రాజ్య నౌకను జాగరూకతతో సుడిగుండములపాలు గాకుండ ముందుకు నడపుకొని పోఁగలిగిన మహామంత్రియు సేనానాయకుఁడును గావలెను.

మహాశయులారా! నే నీభారము నిఁక వహింపఁ జాలను. ఈ భుజస్కంధములమీఁది బరువును వేఱొకరి భుజస్కంధములపై నుంచి నేను విశ్రాంతి తీసికొనఁగోరుచున్నాను. పై రెండుపదవులకును యోగ్యులైన వీరపురుషులను మీరే నిర్ణయింతురుగాక!”

ఇట్లు సిద్ధనామాత్యుఁడు తన యుపన్యాసమును ముగించి నిజాసనముపై నాసీనుఁడయ్యెను. సభాసదుల కరతాళధ్వనులు సభామంటప మంతటఁ బ్రతిధ్వనించినవి.

సభ్యులలో గుసగుసలు బయలుదేరినవి. బాధ్యతాయుతములైన యీ మహోత్తమ స్థానములను సక్రమముగా నిర్వహింపఁగల ధీమంతుఁడును, పరాక్రమవంతుఁడును నెవ్వరాయని యొకరి మొగ మొకరు చూచుకొనసాగిరి. కొందఱి దృష్టులు మనుమసిద్ధిమహీపాలుని ముఖమండలముపైఁ బ్రసరించినవి. మఱికొందఱు సిద్ధనామాత్యున కిరువైపులఁ బ్రకాశించుచున్న వీరకుమారులవైపు చూచుచుఁ దమలో నేమేమో సంభాషించుకొనసాగిరి. ఇంక కొందఱు సిద్ధనామాత్యుఁడే తగినవారిని నిర్ణయించిన బాగుండునని యనుకొనుచుండిరి. ఇంతలో సభ మఱల నిశ్శబ్దమైనది.

మనుమసిద్ధిమహారాజు లేచినాఁడు. మహామాత్యునకు, సభాసదులకు ధన్యవాదములర్పించుచు నిట్లుపలికినాఁడు:

"మహాజనులారా! వింటిరిగదా మహామాత్యుల వారి వాక్యములు. వీరి యనుపమాన సాహాయ్యముననే, వీరి యద్వితీయమేధాశక్తిచేతనే, వీరి యసాధారణ రాజకార్య చాతుర్యముచేతనే మా తండ్రిగారి రాజ్యము ప్రశాంతముగను, ప్రజాసౌఖ్యదాయకముగను గడచిపోయినది. అందులకు మహామంత్రులవారికి, వారి కుటుంబమునకు మీ యందఱిపక్షమున నేను కృతజ్ఞతాపూర్వక ధన్యవాదములు సమర్పించుచున్నాను. మహామంత్రిగారు సెలవిచ్చిన రెండు స్థానములకును దగినవారిని మీ యందఱి పక్షమున నేనే నిరూపించుచున్నాను. ఇందులకు మీలో నెవ్వరికైన నభ్యంతరమున్నచో నిస్సందేహముగా తెలుపవచ్చును.

చూడుఁడు: సిద్ధనామాత్యులవారి సోదరుఁడైన కొమ్మనామాత్యులవారి కుమారుఁడు తిక్కనయే మహామంత్రిపీఠము నలంకరింప సర్వవిధములఁ దగియున్నాఁడని నా యుద్దేశము. తరువాత, సిద్ధనామాత్యులవారి జ్యేష్ఠనందనుఁడగు ఖడ్గతిక్కన సర్వసేనాధ్యక్షస్థానమునకు సమర్థుఁడని నేను దలంచుచున్నాను. ఈ సోదరు లిరువురు నాకుఁ గుడియెడమ భుజములవలెనుండి నేఁటి రాజలోకములోఁ జెలరేఁగుచున్న కల్లోలముల పాలుగాకుండ సింహపురరాజ్యసింహాసనమును సముద్ధరింపఁగల యనుపమానశక్తిసమన్వితులని నా దృఢవిశ్వాసము. ఇందులకు మీ యందఱ యంగీకారము నెఱుంగఁగోరుచున్నాను.”

మహారాజీవిధముగాఁ బలికినంతనే సభయంతయు నానందోత్సాహములతోఁ బొంగిపోయెను. తగిన నిర్ణయమనియు, మహారాజు చిన్నవాఁడయినను మంచి దూరాలోచనము గలవాఁడనియును, నిఁక విక్రమపుర రాజ్యము మూఁడు పూ లాఱు కాయలుగా దినదినాభివృద్ధి నందఁగలదనియును సభాసదులు పెక్కువిధముల ననుకొనుచుండిరి.

సభ్యుల యంగీకారసూచకముగ జయజయనినాదములును, కరతాళధ్వనులును మిన్నుముట్టెను. సిద్ధన మందహాస వదనముతోఁ దన ప్రక్కలఁ గూర్చుండియున్న యువద్వయమువైపు దృష్టిసారించెను. ఆ యువకు లిరువురు కవితిక్కనయు, ఖడ్గతిక్కనయు నని మన మూహింపవచ్చును.

మనుమసిద్ధిమహారాజు బంగారు పళ్లెరములో నొక బహుమూల్య శిరోవేష్టనమును, నొక సముజ్జ్వల కరవాల

మను మఱికొన్ని యుపహారములను సిద్ధముగావించి సిద్ధనామాత్యునివైపు సబహుమానముగఁ గనుఁగొనెను. మహారాజునాజ్ఞ యుద్దేశము గ్రహించి సిద్ధనమంత్రి కుమారుల నిరువురను చెఱియొక కరమున గ్రహించి ముందుకు నడచెను. మనుమసిద్ధినృపాలుఁడు కవితిక్కనకు శిరోవేష్టనమును, ఖడ్గతిక్కనకు మహాఖడ్గమును బహూకరించెను. మహామాత్య ముద్రాంకితములగు మణిమయభూషణములను కవితిక్కన కలంకరించెను. సర్వసేనానాయక ముద్రాముద్రితములైన రత్నాభరణములను ఖడ్గతిక్కనకుఁ గైసేసెను.

తన బుద్ధిబలముచే సింహపురరాజ్యము నభివృద్ధిపఱచి మనుమసిద్ధి మహీపాలుని సింహాసనమును సుప్రతిష్ఠిత మొనరింపఁగలనని కవితిక్కన ప్రమాణము సలిపెను. నిజఖడ్గధారచేఁ బ్రతిపక్ష సమూహములను ద్రుంచి చెండాడి విక్రమసింహపురమును విజయలక్ష్మీవిరాజితమును గావించి యాంధ్రసామ్రాజ్యము నభివృద్ధి సేయఁగలనని ఖడ్గతిక్కన ప్రతిజ్ఞ గావించెను. "నాయనలారా! రాజభక్తులై ప్రజాసేవ యొనరించి మన కొట్టరువు వంశమునకు యశస్సు సంపాదింపుఁ" డని సిద్ధన మంత్రికుమారులను ప్రబోధించెను.

మంత్రవిదులగు మహీసుర పుంగవు లా వీరపుంగవులను సింహపుర ప్రధానామాత్యపీఠమునకును ప్రధాన సేనాధ్యక్షపదవికిని యథావిధి నభిషేకించిరి. వృద్ధపురంధ్రీమణులు మంగళగీతములు పాడిరి. మనుమసిద్ధిమహారాజు శరీరము పులకించెను. సిద్ధనామాత్యుని నయనాంచలముల నానందబాష్పములు ప్రవహించెను. సోదరు లిరువురు నొకరి

నాకరు చూచుకొనిరి. సంతోషసూచకముగా వారి వదన కమలములు దరహాసభాసురము లయ్యెను.

---

౨

ప్రస్తుతము నెల్లూరని పిలువఁబడుచున్న పట్టణమునకే పూర్వము విక్రమసింహపుర మను నామము ప్రసిద్ధమైయుండినది. ఆ పట్టణప్రాంతముననే పినాకినీనది యొడ్డులకంటి యేప్రొద్దును ప్రవహించుచుండును. ఆ పెన్నానదీజలములచే నందలి భూములన్నియు సస్యశ్యామలములై, కోమలములై చూపఱనేత్రములకు విందుగావించుచుండును. ఇంతియేకాక యాకాలమున నిప్పట్టణమునం దఱువది దేవాలయము లుండెడివి. పట్టణవాసులందఱు "నెఱజాణ" లన వన్నెకెక్కియుండిరి. ఆ నగరవీథులన్నియు నానాదేశములనుండి యెడతెగక వచ్చుచుండు సార్థవాహులతోడను, నుత్తమాశ్వములతోడను, మదగజేంద్రములతోడను నిండి యుండెను. ఇట్లు సకలసంపదల కాలవాలమై, వీరాధివీరులకు జన్మభూమియై, శత్రురాజులకు దుర్భేద్యమై, విజయశోభాసమలంకృతమై, నిత్యకల్యాణములతోఁ బచ్చతోరణములతో నమరావతీపట్టణమునకు నీడగు విక్రమసింహపురమును రాజధానిగాఁ జేసికొని తిక్కభూపాలుఁడు ప్రజాపాలనము గావించుచుండెను.

తిక్కభూపాలుఁడు సూర్యవంశోద్భవులయిన తెనుఁగుచోళులలోనివాఁడు. ఇతఁడు మొదట కాంచీపురము రాజధానిగాఁ బరిపాలించుచున్న కులోత్తుంగ చోడదేవునకు

సామంతుఁడుగా నుండెను. తరువాత నాతఁడు గతించిన తోడనే తిక్కనృపాలుఁడు స్వతంత్రుఁడయ్యెను. ఆ సమయమునఁ గాంచీపుర సింహాసనమునుగూర్చి రాజరాజనరేంద్రుని వంశీయులగు చాళుక్య-చోళులయందలివాఁడగు మూఁడవ రాజరాజునకును మూఁడవ రాజేంద్రచోడునకును కలహము సంభవించెను. అట్టియెడఁ దిక్కనృపాలుఁడు మూఁడవ రాజరాజపక్షము వహించి రాజేంద్రచోడునిపై యుద్ధము చాటించెను.

రెండువైపులవారికిని జాలకాలమువఱకుఁ బోరాటములు జరుగుచునే యుండెను. చివరకుఁ దిక్కభూపతి రాజేంద్రచోడుని జయించి రాజరాజచోడుని గాంచీపుర రాజ్యమునకుఁ బట్టాభిషిక్తునిఁగావించి "చోడసింహాసన స్థాపనాచార్య" బిరుదము నందెను. ఇట్లు తిక్కనృపాలుఁడప్రతిమానశౌర్యధనుఁడై, పరభయంకరుఁడై యనేకసంగ్రామరంగముల విజయలక్ష్మిని పరిగ్రహించి విక్రమసింహాపురమును పెక్కు సంవత్సరములు పరిపాలించి క్రీ. శ. ౧౨౫౦ వ సంవత్సరమున లోకాంతరగతుఁ డయ్యెను.

తిక్కభూపాలుని యనంతరము తదీయ పుత్రరత్నమగు మనుమసిద్ధినృపాలుఁడు రాజ్యమునకు వచ్చెను. సింహాసనము నెక్కినప్పటికి మనుమసిద్ధి చాల పిన్నవయస్సువాఁడు. ఈతఁడును దన జనకునివలెఁ బరాక్రమశాలియైనను బాలుఁడగుటచే రాజకార్యములయం దంతగా సామర్థ్యము సంపాదింపక పోవుట గ్రహించి పరభూపతుల కన్నులన్నియు విక్రమసింహాపురముపైఁ బడెను.

తిక్కభూపాలుఁడు గతించుటతోడనే యొక్కడివా రక్కడ విజృంభించిరి. దేశమందంతటను నల్లరులు వ్యాపించెను. పరస్పరయుద్ధములవలన పెక్కు రాజవంశములు నశించిపోవుచుండెను. తిక్కనృపాలుఁడు రాజరాజచోడుని కాంచీపుర సింహాసనాసీనుం గావించినను దానినిగూర్చి చోళులలోఁ గొట్లాట లింకను తగ్గలేదు; అన్యోన్యము రాజ్యాధికారముకొఱకై తగవులాడుచునేయుండిరి. మధురాపురపుఁ బాండ్యులును, హళెవీటి హొయిసలులును, ఓరుగంటి కాకతీయులును, దేవగిరి యాదవులును చెలరేఁగి స్వతంత్రరాజ్య సంస్థాపనమునకై ప్రయత్నించుచుండిరి. ఈ పరస్పర కలహములతో, నూత్నరాజ్యస్థాపన ప్రయత్నములతో నన్యోన్య విద్వేషములతో దక్షిణాపథమంతయు కల్లోలితమై పోవుచుండెను.

మనుమసిద్ధినృపాలుఁడు సింహాసనాసీనుఁ డగుటయు రాజ్యమునఁ గల్లోలములు మెండగుటయు నొక్కమారె సమకూరెను. ఆయనరాజ్య మప్పటికి కావలి మొదలుకొని కాంచీపురమువఱకును వ్యాపించియుండెను. రాజ్యము చిన్నదియేయైనను నాలుగు దిక్కులనుండి చెలరేఁగిన కల్లోలముల మూలమున మనుమసిద్ధికి విశ్రాంతి లభింపకుండెను. కాని తిక్కనృపాలునివద్ద మహామంత్రిగను, ప్రధానసేనానాయకుఁడుగను నుండిన సిద్ధనామాత్యుఁడే మనుమసిద్ధిమహీపాలునకును మంత్రియై, సేనాపతియై కొంతకాలము రాజ్య నౌకను నెట్టుకొని వచ్చెను. ఈతఁడు కార్యఖడ్గములయం దప్రతిమానుఁడై వన్నెకెక్కినవాఁడు.

సిద్ధనామాత్యుఁడు మంత్రిభాస్కరుని కుమారుఁడు. మంత్రిభాస్కరునకు కొమ్మాంబ యను సతీరత్నమునందు నలుగురు కుమారు లుద్భవించిరి. వారు వరుసగాఁ గేతన, మల్లన, సిద్ధన, కొమ్మన నామధేయములచే నొప్పి చరిత్రప్రసిద్ధి గడించిరి. వీరియందు సిద్ధన మనుమసిద్ధియొద్దను, ఆయన జనకుఁడగు తిక్కనృపాలునియొద్దను మహామంత్రియై యశస్సు సంపాదించినాఁడు. చిన్నవాఁడైన కొమ్మనయు నెల్లూరుపట్టణమునకు దండనాథుఁడై విఖ్యాతిగాంచినాఁడు. వీరింటిపేరు "కొట్టరువువారు". కొట్టరువువారు మొదటినుండియు నమాత్యపదవులయం దసమానులై రాజ్యచక్రము త్రిప్పి దిగంత విశ్రాంత యశోమహితులై గణనకెక్కిరి.

ఏ మహానుభావుఁడు మహాభారతమునందలి పదునెనిమిది పర్వములను బూరించి తన మృదుమధుర కవితాప్రవాహముచే నాంధ్రప్రజాహృదయముల నాప్లావితములొనర్చి కవిబ్రహ్మయై యుభయకవిమిత్త్రుఁడై యొప్పారెనో, ఏ రసవత్కవిశేఖరుని సువర్ణనామాక్షరములు ఆంధ్రభాషాయోష కలంకారప్రాయములై వెలయుచుండెనో ఆ మహాకవి తిక్కనసోమయాజి కొట్టరువు వంశోద్భవుఁడైన కొమ్మనామాత్యుని కుమారుఁడే.

ఏ వీరాగ్రేసరుఁడు తన నిరుపమాన రణకేళీవిలాసములచే శత్రుసముచ్చయముపై దుమికి తుత్తునియలొనర్చి జయలక్ష్మీసమేతుఁడై యఖండఖ్యాతి నార్జించెనో, ఏ సేనాని యపరసేనానియై నిజ ఖడ్గచాలనముచే విక్రమపుర సింహాసనమును సుప్రతిష్ఠితమొనరించి "యభినవ పరశురాముఁ"డను

కీర్తి సముపార్జించెనో యా యభిమానధనుఁడు, ఖడ్గతిక్కన కొట్టరువు వంశోద్భవుఁడైన సిద్ధనామాత్యుని జ్యేష్ఠనందనుఁడే.

సిద్ధనామాత్యుని కుమారుఁ డగుటవలన సిద్ధయతిక్కఁ డనియును, ప్రోలాంబికనందనుఁ డగుటచేఁ బ్రోలమతిక్కఁ డనియును, మైలమ యనుదాసి పెంచుటచే మైలమతిక్కఁ డనియును, రణరంగమునం దసహాయశూరుఁడై శత్రుచమూ సమూహమును జించిచెండాడుటచే రణతిక్కన యనియును, ఖడ్గమును ద్రిప్పుటయం దద్వితీయ నైపుణ్యము గలవాఁ డగుటచే ఖడ్గతిక్కన యనియును నా వీరవతంసునకు నైదు విధము లగు నామమ్ములు వచ్చినవి.

బాల్యమునుండియును ఖడ్గతిక్కనకును గవితిక్కనకును నన్యోన్య స్వభావములయందు మిక్కిలి భేదము గానుపించుచుండెను. కవితిక్కనకుఁ జిన్నతనమునుండియుఁ జదువు సంధ్యలయందు శ్రద్ధ యధికము. ఖడ్గతిక్కనకు మొదటినుండియు నాటపాటలయం దాసక్తి మెండు. కవితిక్కన శాస్త్రములతోఁ బ్రొద్దుపుచ్చుచుండెను. ఖడ్గతిక్కన శస్త్రములతోఁ గాలముగడుపుచుండెను. కవితిక్కనకు మంత్రాంగములన్నఁ బ్రీతి. ఖడ్గతిక్కనకు మల్లయుద్ధములన్న ప్రాణము. ఒకరికి బుద్ధిబల మఖండము. మఱియొకరికి భుజబల మపారము. ఒకరిది బ్రాహ్మణధర్మము. వేరొకరిది క్షాత్రధర్మము.

ఒకేవంశమున జన్మించినను, అన్నదమ్ములబిడ్డలైనను తిక్కనద్వయము స్వభావసిద్ధములగు మనఃప్రవృత్తులచే భిన్నముగఁ గానుపించుచుండిరి.

బాల్యమునుండియుఁ బాఠశాల నెగఁగొట్టి బాలురతో నాటలాడుచుఁ గోటలెక్కుచు నల్లరి చిల్లరగాఁ దిరుగుచున్న కుమారుఁడెట్లు త్రోవకువచ్చునాయని సిద్ధనామాత్యుఁడు మిక్కిలి విచారించెను. కాని క్రమక్రమముగా ఖడ్గతిక్కన మహావీరుఁడై రణరహస్యముల నెఱింగి యనుపమాన తేజో విరాజితుఁడగుటఁ గాంచి ప్రోలమాంబా సిద్ధనామాత్యుల హృదయములు సంతోష సరసిలో నోలలాడసాగెను. చివరకు వారి భాగ్యవశమున ఖడ్గతిక్కన మనుమసిద్ధిమహీపాలుని సర్వసేనాధ్యక్షుఁడై, మహామాత్యపదవిని గ్రహించిన కవితిక్కనకు ప్రేమపాత్రుఁడై సింహపుర రాజ్యలక్ష్మి కాధార స్తంభమై వీరాధివీరుఁడై వెలుఁగొందినాఁడు.

ఇవ్విధమునఁ గవితిక్కనయును ఖడ్గతిక్కనయును మనుమసిద్ధిమహారాజునకుఁ గుడియెడమ భుజములుగానుండి, రాజ్యచక్రమును నడిపించుచుండిరి. ఆలమున ఖడ్గతిక్కనకును, ఆలోచనమునఁ గవితిక్కనకును నెందును నెదురు లేకుండెను. యోగ్యులైన మంత్రియును సేనాపతియును లభించుటచే మనుమసిద్ధినృపాలుఁడు మిక్కిలియు సంతోషితస్వాంతుఁడై పగవారికిఁ గన్నెఱ్ఱగ నెల్లూరును పాలించుచుండెను. వీరి సహాయముచే నా రాజపుంగవుఁడు పెక్కు పర్యాయములు ప్రతిపక్షులఁ దునుమాడి జయలక్ష్మిని గైకొనియెను.

ఆ సమయమునఁ గాటమరాజు కనిగిరిసీమను పరిపాలించుచుండెను. ఆయన రాజధాని యెఱ్ఱగడ్డపాడు. కాటమరాజు పెద్దిరాజు కుమారుఁడు; గొప్ప వీరుఁడు. యాదవులందఱు నితని

నవతారపురుషునిగా భావించుచుండిరి. నెల్లూరి రాజులకును, యాదవరాజులకును మొదటినుండియు నంతఃకలహములు గలవు. తిక్కనృపాలుఁడు గతించినవెంటనే యవి మఱింత వృద్ధిపొందసాగెను. వారును వీరును పరస్పర విరోధములఁ బెంచుకొని యవకాశమునకై వేచియుండిరి. కలహము పెంచుకొని కయ్యము సేయఁ దలంచువారలకుఁ గారణములే లేకుండునా?

---

## 3

ఒకానొక దినమ్మున నఖండవైభవోపేతుఁడై మంత్రి సామంత దండనాథసమేతుఁడై మనుమసిద్ధిమహీపాలుఁడు సింహపుర సింహాసనముపై గొలువుదీరియుండెను. అట్టి సమయమునఁ గొందఱు యాదవులు సభామంటపములోనికిఁ జనుదెంచి మహారాజునకు శిరస్సులువంచి మ్రొక్కిరి. భయభ్రాంతవదనములతోనున్న యా యాదవసముదాయమును సింహపురాధీశ్వరుఁడు కరుణారసప్రసన్నవీక్షణములతోఁ దిలకించుచు నొకప్రక్కఁ గూర్చుండ నియమించి వచ్చినకారణమును విన్నవించుకొనుఁడని యాజ్ఞాపించెను. వారలయందొక పెద్దగొల్లలేచి ముందుకు రెండడుగులువైచి హస్తములు జోడించి "మహారాజా! మేము కాటమరాజు రాజ్యములోనివారలము. మాది కనిగిరిసీమ. దేవరవారి సందర్శనమునకై మా రాజు మమ్ములను తమయొద్దకుఁ బంపించినాఁ" డని పలికెను.

కాటమరాజు పంపున వచ్చినవారని వినినంతనే మనుమసిద్ధిమహారాజు సాభిప్రాయముగ మహామంత్రియగు

తిక్కనామాత్యునివైపు తనదృష్టి ప్రసరింపఁజేసెను. తిక్కనామాత్యుఁడును కొంచె మాలోచించి "ఓరీ! మీరాజు మిమ్ముల నేల పంపె? మీరు వచ్చినకార్య మెద్దియో మహారాజుల వారికి విన్నవించుకొనుఁ" డని యాదవులవైపు చూచి పలికెను.

వచ్చిన యాదవులలో నొక వృద్ధుఁడు కొంచెము ముందుకువచ్చి మఱల నిట్లు ప్రారంభించెను: "దొరా! ఈ సంవత్సరము మా రాజ్యములో బొత్తిగా వర్షములు గురియ లేదు. మాపంటపైరులు మలమల మాడిపోయినవి. మాకు తిండిగింజలు లేవు సరికదా మా పశువులకు మేఁతయును నాస్త్యమై పోయినది. కాటకముచే కనిగిరిసీమయంతయును గగ్గోలు పడుచున్నది. కడుపులు మాఁడి మా గోగణములు కుప్పలు కుప్పలుగాఁ గూలి నశించిపోవుచున్నవి. మీచిత్తము మాభాగ్య" మని పలుకుచు నాతఁడు మరలమరలఁ జేతులు పైకెత్తి మహారాజునకు నమస్కరించెను. గోపాలకులందఱు నొక్కమాటుగా "మమ్ములను మాపశువులను రక్షించండి బాబూ" అని మ్రొక్కిరి. ఖడ్గతిక్కన యొకప్రక్కఁ గూర్చుండి యిదియంతయును గమనించుచునే యుండెను.

మహారాజు చేసన్నతో మిన్నకుండుఁడని యాదవులను వారించి వృద్ధగోపాలునితో "ఓయీ! ఐన, మీ యుద్దేశ మేమి? మీరు మావలన నెట్టిసాయమును గోరుచున్నారో స్పష్టముగాఁ బలుకుఁ" డని వచించెను. మరల నా యాదవ వీరుఁ డీ విధముగా మనవి చేసికొనసాగెను. "సామీ! ఏమీ తమ యదృష్టము! పచ్చలేఁబచ్చికతోఁ

గాఁకళలాడు దేవరవారి పొలములు కన్నులపండువుగాఁ గానవచ్చుచున్నవి. తమ పంటపైరులు తమ మహాభాగ్యమును వేనోళ్లఁ జాటుచున్నవి. ఈ సంవత్సరమునకు మా పశువులకు మేఁతకొఱకై కొన్ని పచ్చికబీళ్లు మాకు గుత్తకీయవలెనని వేఁడుకొనుచున్నాము. అందుక్రింద తమరు నిర్ణయించిన పుల్లరిని మేము చెల్లించుకొందుము. ఈ కష్ట సమయమున మమ్ము మా పశువులను గాపాడుఁడని మా మహారాజుగారు తమతో మఱిమఱి విన్నవించుకొన్నట్లు చెప్పుమన్నారు. తర్వాత తమ చిత్త"మని యా యాదవ వృద్ధుఁడు మూఁడు పర్యాయములు నేలకువంగి నమస్కారములు గావించెను.

మనుమసిద్ధిమహీనాథుఁడు స్వభావసిద్ధముగ దయార్ద్ర హృదయుఁడు. ఆగర్భశత్రువులైనను యాదవులు కాటకముచే బాధపడుచున్నారని విన్నయంతనే యాయన హృదయము కరఁగెను. వారు గోవులు మేపుకొనుటకై తమ రాజ్యమునందలి పచ్చికబీళ్ల నొసంగుటకు నాయన హృదయ మంగీకరించెను. మనుమసిద్ధిమహారాజు భావమును గ్రహించిన తిక్కనామాత్యుఁడు కాదనలేకపోయెను.

కాని ఖడ్గతిక్కన కిది యెంతమాత్రము భరింపరాని విషయమయ్యెను. కాటమరాజు స్వభావ మాతఁడు బాగుగ నెఱుఁగును. ఇందులో నేదో మోసముకలదని యాతఁ డూహించెను. వెంటనే మహారాజున కభిముఖుఁడై "నృపాలశేఖరా! మనము పెక్కుదినములనుండియు కాటమరాజు స్వభావము నెఱుంగుదుము. ఆతఁ డెట్లయిన మనపైఁ

బగదీర్చుకొనవలయునని వేచియున్నాఁడు. నేఁడు కష్టము వచ్చినది గనుక కాళ్లబేరమునకు దిగినాఁడు. "ఏరుదాఁటిన వెనుకఁ దెప్పగాల్చు" వారలను మనము విశ్వసించి మన రాజ్యములో వారికిఁ జోటిచ్చుట కొఱవితోఁ దల గోఁకు కొనుటవంటిది. ఈ విషయమున దేవరవారు దూరమాలోచించి కర్తవ్యమును నిర్ణయింపవలయునని కోరుచున్నా" నని పలికి కూర్చుండెను. యాదవుల ముఖములు వెలవెలఁబోయినవి. ఇఁకఁ దమకు సింహపురసీమలో నడుగుపెట్టు నవకాశము లేదని వారు తలంచిరి.

కవితిక్కనయు నీ విషయమునఁ దీవ్రముగా నాలోచించెను. కఱవుకాటకములలోనున్న వారికి సాహాయ్యము చేయుటయే ధర్మమని తుదకొక నిర్ణయమునకు వచ్చెను. అందును గోగణరక్షణ మవశ్యకర్తవ్యముగా నాయనకుఁ దోఁచెను. చిట్టచివరకు మహారాజుతో నాలోచించి పుల్లరి పుచ్చుకొని భూములిచ్చుటకే నిశ్చయించెను. కొన్నిబీళ్లను గొంతకాలమువఱకు యాదవులకు కవులున కిచ్చునట్లును, అందులకుఁగాను పుల్లరిక్రిందఁ గాటమరాజు వేయివరాలు మనుమసిద్ధిమహారాజునకు గడువుదాఁటకుండ చెల్లించునట్లును పరస్పరము 'ఒప్పందము' చేసికొనిరి.

యాదవులు సంతోషముతో గంతులువైచుచుఁ దమ వచ్చినకార్యము నెఱవేఱినందుకుఁ బోలేరమ్మకును, పోతురాజునకును వందనములు సమర్పించుచుఁ గనిగిరిసీమకుఁ బరుగుపరుగునఁబోయి కాటమరాజున కిదియంతయుఁ దెలియఁ బఱచిరి. కాటమరా జందుల కిష్టపడిన తరువాత కనిగిరి

సీమయందలి గోబృందములను తోలుకొని యాదవులందఱు సింహపురరాజ్యమునందుఁ బ్రవేశించి తాము గుత్తకు తీసికొన్న పచ్చికబీళ్లలో మేపుకొనసాగిరి. చిక్కి యెముకలు బయటపడియున్న గోవులన్నియుఁ గొలఁది కాలములోనే కండపట్టి కామధేనువులయ్యెను. కోడెదూడలు నంది వాహనములవలె బలిసి ఱంకెలు వేయసాగెను. పగలెల్ల పచ్చికమేసి పెన్నానదిలో మధురజలమ్మును ద్రావి కనిగిరి పసువులు కళకళలాడుచు కనులపండువు గావించుచుండెను.

గడువు సమీపించినది. పశువులను మేపుకొనుటయే గాని పుల్లరిక్రింద నీయవలసిన ధనముమాట కనిగిరి యాదవులకు జ్ఞాపకమే లేకపోయెను. మనుమసిద్ధిమహారాజు సేవకులను బంపి తమకీయవలసిన ధనమును వెంటనే చెల్లింపవలయునని యాదవులకు వర్తమానము చేసెను. కాని వారు సైనికులమాటలను పెడచెవిని పెట్టిరి. బలవంతముచేయు పరిస్థితి రాఁగా, చివరకు రెండుమూఁడుదినములలో నీయవలసిన పుల్లరిపైకము సంతయు నిత్తుమనిచెప్పి యప్పటికిఁ దప్పుకొనిరి. అనంతర మొకరాత్రి దొంగతనముగాఁ బసువులను దోలుకొని తమ రాజధానికి వెడలిపోయిరి.

తమబీళ్లలో సంవత్సరమంతయుఁ బసువులను మేపుకొని చివరకుఁ దమకీయ నిర్ణయించుకొన్న ధనమును చెల్లింపకుండ మోసముచేసి యాదవులు గోవులను దోలుకొని కనిగిరిసీమకు జనినారను వార్త వినినంతనే మనుమసిద్ధి మహారాజునకు మిక్కిలి యాగ్రహాము కలిగెను. అతఁడు వెంటనే యఖండసేనాసమేతుఁడై కనిగిరిసీమపై దండెత్తి

యాదవుల సర్వభాగము గావింపఁదలఁచెనుగాని తిక్కనా మాత్యుఁడు దూరదృష్టితో నాలోచించి రాజుతో నిట్లు పలికెను :

"మహారాజా! కాటమరాజు జెట్టి మోసముచేయు నని నేను మొదటనే యూహించితిని. కాని శరణాగతరక్షణ బిరుదాంకితులగు మీ సంకల్పమును గాదనజాలకపోయితిని. కష్టము కలిగినప్పుడు వచ్చి మనపాదములు పట్టుకొన్నారు యాదవులు. వర్షములు కురిసి భూమి పచ్చపడఁగానే మన పుల్లరినైన మెగఁగొట్టి పశువులను దోలుకొనిపోయినారు. చూచితిరా వారి దుర్మార్గము! దీనికంతటికిఁ గాటమరాజు ప్రోత్సాహమే కారణము. అయినను తొలుదొల్తనే కయ్యమునకుఁ గడంగుట క్షత్రియధర్మముగాదు. సాధ్యమయినంతవఱకు సామోపాయముచేతనే కార్యమును సాధింపవలయునని నా యుద్దేశము. యాదవులుచేసిన యపరాధమును గాటమరాజునకెఱుకపఱచి న్యాయముగా మనకు రావలసిన ధనమును చెల్లింపుమని కాటమరాజునొద్దకొక రాయబారి నంపుదము. క్రమముగా నిచ్చెనా సరే, యక్రమమునకువచ్చెనా పరాక్రమమే ప్రయోగింతము."

అని పలుకుచున్న మహామంత్రి యాలోచనమునకెంతయు సంతసించి మనుమసిద్ధి "అమాత్యశేఖరా! అందులకుఁ దగినవా రెవ్వరో మీరే నిర్ణయింపుఁ" డని వచించెను. సహాయమంత్రియగు 'అన్నంభట్టు' రాయబారము గొనిపోవుటకు యోగ్యుఁడని యందఱు నేకకంఠముగాఁ బలికిరి.

అన్నంభట్టు రాయబారము ఖడ్గతిక్కన కేమాత్ర మును నచ్చలేదు. ఖడ్గమునకుఁ దప్ప కాటమరాజు రాయ బారములకు లొంగఁడని యతని నమ్మకము. మదోన్మత్తులై రాజద్రోహము గావించిన కనిగిరియాదవులపైఁ గసితీర్చు కొనుట యెప్పుడా యని యాతఁడు తొందరపడసాగెను. అయినను సంధిప్రయత్నములను గాదనలేక కోపమునంతయును దిగమ్రింగి సమయమునకై యెదురుచూచుచుండెను.

---

## ౪

మఱునాఁడు కొంత పరివారమును వెంటఁబెట్టుకొని యన్నంభట్టు రాయబారియై యెఱ్ఱగడ్డపాడునకుఁ బోయెను. సింహపురినుండి మనుమసిద్ధిరాయబారి వచ్చినాఁడని ద్వార పాలకులు కాటమరాజున కెఱింగించిరి. "పుల్లరిడబ్బుల కొఱకే యీ రాయబార" మనుకొనుచు రాయబారిని లోనికిఁ గొనిరండని కాటమరా జాజ్ఞాపించెను.

అన్నంభట్టు సభామందిరమును బ్రవేశించెను. కాని రాయబారికి జరుగవలసిన సముచిత సత్కారములేమియు నాయనకు జరుగలేదు. సభలోనివా రందఱు నన్నంభట్టును వెక్కిరించుచు వేళాకోళములు చేయసాగిరి. యాదవ సేనా నాయకులు కన్నులెఱ్ఱచేసి యాయనవైపు చుఱచుఱ చూచు చుండిరి. కాటమరాజు నిర్లక్ష్యముగా నన్నంభట్టును వీక్షించుచు నొక సామాన్యపీఠముపైఁ గూర్చుండ నియోగించి రాయబారమేమో వినిపింపుమని పలికెను.

అన్నంభట్టు పీఠముపై నాసీనుఁడై గంభీరకంఠస్వర ముతో నిట్లు ప్రారంభించెను. "కాటమరాజా! మీ యాదవులు గోవులమేఁతకై కొన్ని పచ్చికబీళ్లను మాయొద్ద గుత్తకు తీసికొన్నారు. అందు కీయవలసిన పుల్లరిక్రింద పదివందల బంగారు నాణెముల నిచ్చుటకై యొప్పందము జరిగినది. పై విషయములు మీకు తెలిసియే యుండవచ్చును. సంవత్సరముపొడుగునను పశువులను మేఁపుకొని మీవారు మా కీయవలసిన ధనము నీయకుండ దొంగతనముగా పశువులను దోలుకొనివచ్చిరి. ఇది ద్రోహము; అధర్మము. మీవారు చేసిన యకార్యమునకు మా మహారాజు మిక్కిలి కోపించి యున్నాఁడు. మా సేనానాయకుఁడు ఖడ్గతిక్కన మండి పడుచున్నాఁడు. నెల్లూరి పురవాసులందఱు మీ కృత్యముల నేవగించుకొనుచున్నారు. కనుక మీరు మీవారుచేసిన తప్పిదమును విచారించి మాకు న్యాయముగా రావలసిన ధనమును వెంటనే చెల్లింపవలయునని యడుగవచ్చినాను. ఇప్పటికైనను మిగిలిపోయినది లేదు. ముందు వెనుక లాలోచించుకొని మీ యుద్దేశమును వెల్లడింపుఁడు."

అన్నంభట్టు వాక్యములు వినుచున్నకొలఁది కాటమ రాజు ముఖమండలము జేవురించెను. కోపముచే నాతని పెదవి కంపింపఁజొచ్చెను. పండ్లు పటపట కొఱుకుచు "భట్టా! మంచిరాయబారము దెచ్చితివి. పుల్లరియేమి? ఇచ్చుటయేమి? అసలు మీ మేఁత మా యావులకు సరిపడ లేదు. రోగములచే మా యావు లెన్నో మరణించినవి. మాకు సంభవించిన నష్టమునకును మీ కీయవలసిన పుల్లరికిని

[illegible]యినది. కనుక నీయవలసినది లేదు; పుచ్చుకొనవలసినది లేదు. ఈ మాటలు మీ రాజునకుఁ జెల్పుము. మీ సేనానాయకుల పేరు చెప్పి మమ్ము భయపెట్టఁ జూచుచున్నావు కాఁబోలు. మీ మాత్రము మగఁటిమి మాకును గలదు. ఇంక మాఱుమాటాడక వచ్చిన త్రోవను బట్టి పొమ్మని తిరస్కరించి పలికెను.

అన్నంభట్టు చేయునది లేక మఱియొకమాఱు మంచి మాటలతోఁ బ్రయత్నింపఁజూచెను గాని యాదవసేనానులు కత్తులుదూసి మీఁది కుఱికివచ్చిరి. ఇఁక లాభము లేదనుకొని "మంచిది! కాటమరాజా! పుణ్యమునకుఁబోవ పాప మెదురుగా వచ్చినది. నేను బోవుచున్నాను. అన్యాయమునకు ఫల మనుభవింపఁగల" రని పలికి యన్నంభట్టు కాటమరాజును వీడ్కొని సింహపురమునకుఁ దిరిగివచ్చెను.

రాయబారము విఫలమైనదని తెలియుటతోడనే తిక్కనామాత్యుఁడు మిక్కిలి చింతించెను. మనుమసిద్ధి మహారాజు చేయునది లేక సైన్యములను సంసిద్ధము సేయ చమూపతుల కాజ్ఞాపించెను. ఇఁక నెల్లూరు సేనానాయకులు మహోత్సాహముతోఁ దమ ఖడ్గములకుఁ బదును పెట్టుచుండిరి. ఖడ్గతిక్కన యుద్ధమున యాదవబలముపైఁబడి పటాపంచలు గావించుటకై క్షణములు లెక్కపెట్టుకొనుచుండెను.

యుద్ధము నిశ్చితమైనది. ఉభయసైన్యములును దమ తమ సేనానాయకులతోఁ గలసి సంసిద్ధము లగుచుండెను. మనుమసిద్ధిమహీపాలునకు సహాయముగా తిరునామాల

తిప్పరాజు, శ్రీకంఠరాజు, పెదవరదరాజు, అప్పకొండ అచ్చిరాజు, గుంటకొండ గంగరాజు, పట్టుకోట బసవరాజు, కాళహస్తి పాపతిమ్మరాజు, దేవముని వెంగళయ్య, ఉదయాద్రి ఉమ్మయ్య మొదలగు యోధాగ్రేసరు లందఱు వచ్చిరి. అట్లువచ్చిన మహాసైన్యమున కంతకును "పగవారి గుండెలు బ్రద్దలుచేయు" ఖడ్గతిక్కన సర్వసేనానాయకుఁ డయ్యెను. సేనాముఖమున నశ్వారూఢుఁడై నిలిచియున్న రణతిక్కన భారతవీరులగు ద్రోణాచార్యుని, నశ్వత్థామను దలఁపునకుఁ దెచ్చుచుండెను.

విక్రమసింహాపుర వీరసైన్యములు యుద్ధమునకు సిద్ధమై వచ్చుచున్న వను వార్త వినుటతోడనే కనిగిరి సైన్యములను వెంటనిడికొని కాటమరాజు కదనరంగమునకుఁ గదలివచ్చెను. యాదవుల పక్షమున యుద్ధముసేయుటకై పలనాటి పద్మనాయఁడును, పల్లికొండ చల్లపిన్నమ నాయఁడును, పాచయ్యనాయఁడును, ముమ్మయ్యనాయఁడును, నాచకూళ్లనాయఁడును, కరియావులరాజును, భట్టావులరాజును, దోనకొండ అయితమరాజును, ఉత్తమరాజు మొదలగు వీరాగ్రేసరు లందఱును సమరరంగమునకు వెడలిరి. ఈ సైన్యమున కంతటికిని పిన్నమనాయని మంత్రియు నారాధ్యబ్రాహ్మణుఁడు నగు బ్రహ్మరుద్రయ్య నాయకత్వము వహించెను. బ్రహ్మరుద్రయ్య ఖడ్గతిక్కనకు సర్వవిధముల సమానుఁడైన జోదు.

పాలేటి యొడ్డున నున్న పంచలింగాలకొండ యొద్ద నుభయసైన్యములకు యుద్ధరంగము నిర్ణీతమైనది. ఎవరి మట్టుకువారు తమకే జయము లభింపఁగలదను దృఢనిశ్చయ

మంత్రితో నుడివిరి. ఖడ్గతిక్కన మాత్రము శత్రుసైన్యమును లక్ష్యపెట్టక నేనొక్కఁడనే పోయి యాదవులను జయించి రాఁగలనని పలికి కొలఁదిసైన్యమును మాత్రము వెంటఁ బెట్టుకొని మనుమసిద్ధినృపాలుని యాజ్ఞవడసి యుద్ధరంగమునకు బయలుదేరెను.

"విజయలక్ష్మీసమేతుఁడవై తిరిగిర" మ్మని తండ్రి సిద్ధనామాత్యుఁడు కుమారు నాశీర్వదించెను. "నన్ను వీరమాతను జేయుదువుగాక" యని తల్లి ప్రోలమాంబిక దీవించెను. భార్య చానమ్మ భర్తకు కవచమును దొడిగి ఖడ్గము నందించి నొసట తిలకమును బెట్టి సాగనంపెను. పురమునందలి ముత్తయిదువ లందఱు సౌధాగ్రములనుండి పుష్పవర్షము గురియించిరి. ఖడ్గతిక్కన తన పంచకళ్యాణి గుఱ్ఱముపై నెక్కి నిజసేనాసమేతుఁడై ప్రళయకాలభైరవుని భంగి రణరంగమున కుఱికెను.

యుద్ధభేరి మ్రోఁగసాగినది. ఉభయసైన్యములును రణరంగమునఁ బ్రవేశింపఁ బోవుచుండెను. సేనాధ్యక్షులగు బ్రహ్మరుద్రయ్యయు ఖడ్గతిక్కనయు నొకరి నొకరు గౌరవపూర్వకముగఁ జూచుకొనిరి. ఇరువురును బ్రాహ్మణులే! ఇరువురును మహావీరులే!

తమతమ సైన్యములకు నాయకు లనుజ్ఞ నొసఁగిరి. యుద్ధము ప్రారంభమయ్యెను. రణరంగమంతయు వీరుల సింహనాదములతోఁ బ్రతిధ్వనించుచుండెను. రెండుపక్షముల యందు సైనికులు కుప్పలుకుప్పలుగా నేలఁ గూలుచుండిరి.

సంగరము భయంకరమయ్యెను. తలలు బంతులవలె నాకాశమున కెగిరిపోవుచుండెను. హస్తములు తెగి పడుచుండెను. రక్తము కాలువలుగట్టెను. మొండెములు కొండలవలెఁ గానవచ్చుచుండెను. ఖడ్గతిక్కన ఖడ్గమును గిరగిర త్రిప్పుచు "నిలుఁడు నిలుఁడు" "పోకుఁడు పోకుఁడు" అని హెచ్చరించుచు శత్రువీరుల శిరస్సులను రణభూమికి బలికావించుచుండెను.

ఇంతలో కాటమరాజు ఖడ్గతిక్కనను సమీపించి నమస్కరించి "బ్రాహ్మణోత్తమా! మీరు బ్రాహ్మణులు. మేము యాదవులము. మాకును మీకును యుద్ధము ధర్మము గాదు. మీరేల యుద్ధరంగమునకు వచ్చినారు? ఏమాత్రము మేము తొందరపడినను మాకు బ్రహ్మహత్యాపాతకము బ్రాపించునుగదా" యని పలికెను.

ఖడ్గతిక్కన యాగ్రహావేశముతో "ఓహో! కాటమరాజుగారా! ఎంత న్యాయముగా మాటలాడుచున్నారు! ఇన్నిధర్మము లెప్పుడు నేర్చినారు. మా పుల్లరి నీయవలసి వచ్చినపుడు తమకీ జ్ఞానవాక్యము లన్నియు నెచ్చటకు పోయినవి" అని యేమో పలుకుచుండునంతలో యాదవ సైన్యములు విజృంభించి తన సైన్యములపైఁబడుట నాతఁడు గమనించెను.

ఇదియంతయు కాలయాపనమునకై కాటమరాజు కావించు కుతంత్రమని నిశ్చయించి కత్తిత్రిప్పుచు మరల కదనరంగమున కుఱికెను. కాని తన సైన్యములన్నియు చెల్లాచెదరై పాఱిపోవుచుండుట చూచి "ఓహో! కార్యము

తప్పిపచ్చినదే" యని యెలుఁగెత్తి యిట్లు సంబోధించెను: "ఓ వీరసైనికులారా! సంగరమునఁ బాఱిపోవుట వీరధర్మము గాదు. మన మహారాజు ఋణము దీర్చుకొనుఁడు. సింహపురమున కపఖ్యాతి కలిగింపకుఁడు. వెనుదిరుగుఁడు; వెనుదిరుగుఁ" డని యెన్నివిధములఁ బ్రబోధించినను లాభము లేకపోయెను.

దాదాఁపు సైన్యమంతయును పట్టణాభిముఖమై పరుగిడిపోవుచుండెను. ఖడ్గతిక్కన కేమియును దోఁచలేదు. యాదవసైన్యమా సముద్రమువలె ననంతమై యుండెను. తా నెంత వీరుఁడైనను నొంటరిగా నంతసైన్యముతో నెట్లు మాఱ్కొనఁగలఁడు? ఇది యంతయును యాదవరాజు కుతంత్రముచేఁ గలిగిన ఫలము. అతఁడు తిక్కనను సంభాషణలోనికి దింపి కాలయాపన గావించుటచే నీలోపల యాదవ సైన్యములు విజృంభించినవి.

ఆతని హృదయములో నొక యూహ తోఁచెను. "కానిమ్ము. ఇప్పటికి రణరంగమునుండి తొలఁగిపోయి మఱల సైన్యములను గూర్చుకొనివచ్చి యీ దుర్మార్గుల గర్వమడంచెదఁగాక. తొందఱపడి యిందఱతో మార్కొని కార్యమును పాడుచేయుటకంటె నిదియే యుత్తమ" మని తలఁచి గుఱ్ఱమును మరల్చుకొని నగరాభిముఖుఁడై పోయెను. కాటమరాజు తాను పన్నినయుక్తికి సంతోషించుచు జయము గాంచిన తన సైనికుల నభినందించి సేనానాయకులను గొనియాడి మహానందముతో మైమఱచి యుండెను.

౫

ఏ వీరశిరోమణి బాహుబలపరాక్రమములు మనుమసిద్ధి మహీపాలునకు శ్రీరామరక్షయై చెన్నారుచుండెనో, ఏ ధీరాగ్రేసరుని యసమాన వీరవిహారము లాబాలగోపాలముచేఁ గొనియాడఁబడుచుండెనో, ఏ శూరశిరోరత్నము తేజఃపుంజము పరసేనాసమూహములకుఁ దఱియరానిదో, ఏ మానధనుని భీకర కరవాలము విక్రమసింహపురమునకుఁ బెట్టనికోటయై వెలుఁగొందుచుండెనో, ఏ సాహసోపేతుని విజయగాథలు వృద్ధులు తమ బాలురకుఁ గథలుగాఁ జెప్పుచుందురో యా ప్రతిపక్షభయంకరప్రతాపుఁడు ఖడ్గతిక్కన నేఁడు చెదరిన హృదయముతో—బెదరిన గుఱ్ఱముతో—చిందఱవందరైన శిరోరుహములతో—శిథిలములైన భూషణములతో సంగ్రామరంగమునుండి పిఱికిపందవలె గృహమునకు పర్వెత్తివచ్చుచున్నాఁడు! ఆహా, దైవమహిమ!

ఇట్లు ప్రత్యర్థి సేనావాహినిచేఁ బరాభూతుఁడై కదనరంగమును విడిచి ఖడ్గతిక్కన పురములోనికిఁ బరువెత్తుకొని వచ్చుచున్నాఁడను వార్త పట్టణమునం దందఱకుఁ దెలియవచ్చెను. పరిపరివిధములఁ బురజనులందఱు తిక్కనను నిందింపసాగిరి. కొందఱు "ఇంతవఱకు నేమో యనుకొంటిమి. సిద్ధనామాత్యుని కుమారుఁ డింత పిఱికిపందయా!" యని గేలిసేసిరి. ప్రోలమాంబ గర్భమునఁ జెడఁబుట్టినాఁడని పెద్దముత్తయిదువలు దిట్టసాగిరి. చిన్నచిన్న బాలకులుసైతము కరతాళములు వాయించుచు ఖడ్గతిక్కన వెంటఁబడి "వచ్చెనయ్యా రణవీరుఁడు" అని గోలసేయసాగిరి. కొందఱు

స్త్రీలు భవనోపరిభాగముల నిలిచి రణతిక్కన మొగము చూచి పెటపెట మెటికలు విఱువ నారంభించిరి. ఎట్టు గాంచినను వేళాకోళములే! ఏప్రక్కఁ జూచినను పరిహాసములే! ఎందు విన్నను నిందావాక్యములే!

సంగ్రామరంగమునకుఁ బోవుసమయమున నే వీథులలో సతీమణులు మంగళహారతు లిచ్చి లాజలు చల్లి దీవించిరో యా వీథులలోనే యా సతీమణులే పేడకలాపి చల్లి శపింపసాగిరి. "శుభమగుఁగాక" "జయమగుఁగాక" యని పలికిన ముఖములనుండియే "ఛీ ఛీ" యను తిరస్కార ధ్వనులు వెలువడసాగెను. అప్పుడు గౌరవము — ఇప్పుడగౌరవము. అప్పుడు పుష్పవర్షములు — ఇప్పుడు శిలావర్షములు. అప్పుడు రణోత్సాహము — ఇప్పుడు నిరుత్సాహము. ఎంతలో నెంతమార్పు! పువ్వులమ్మినచోటనే కట్టెలమ్మవలసి వచ్చెనుగదా!

రణతిక్కన లజ్జావనతవదనుఁడై గుఱ్ఱముమీఁదఁ గూర్చుండి గృహాభిముఖుఁడై పోవుచుండెను. ప్రజాసమూహము పలుకు పలుకులు ములుకులువలె నాతని చెవుల గ్రుచ్చుకొనుచుండెను. దుర్భరావమానముతో నా వీరుని గుండెలు కుమిలిపోవుచుండెను. అట్లే రణరంగమున నిలిచి పోరాడి ప్రాణములఁ బాసినచో వీరందఱి కన్నులు చల్లఁబడి యుండును కాఁబోలు! తిక్కన మహావీరుఁడని పొలికేకలు వెట్టెడువారు కాఁబోలు! వాని మృతకళేబరమును మహా వైభవముతో నూరేగించెడువారు కాఁబోలు! ఆహా! యుక్తా

యుద్ధము లెఱుంగని యా మూఢప్రజలు మహాశూరాగ్రేసరుండగు తిక్కన హృదయమును, పరాక్రమవైభవమును, సమయోచిత ప్రవర్తనమును గుర్తింపలేకపోయిరి గదా!

గృహము సమీపించినకొలఁది ఖడ్గతిక్కన హృదయము మఱింత వ్యాకులమగుచుండెను. నిజగేహమున జననీ జనకు లేమని తలంతురో, యెట్లు తూలనాడుదురో యని యాతఁడు లోలోనఁ గుందుచుండెను. తనకిట్టి దుఃస్థితి దెచ్చి పెట్టిన తన దురదృష్టమున కెంతయు దురపిల్లుచు హతశేష మగు సైన్యమును దుర్గములోనికంపి మఱల నాయాజ్ఞ యగు నంతవఱకు గమనాయాసము దీర్చుకొండని వారలను హెచ్చరించి నిజగృహాభిముఖుఁ డయ్యెను.

"ఖడ్గతిక్కన వచ్చుచున్నాఁడు, ఖడ్గతిక్కన వచ్చుచున్నాఁడు" అను పౌరుల కలకల మాలించి తన కుమారుఁడు సంగ్రామరంగమున శాత్రవసైన్యములను సంహార మొనర్చి జయలక్ష్మీ సమేతుఁడై వచ్చుచున్నాఁడు కాఁబోలు నని నందను నభినందించుటకై సిద్ధనామాత్యుఁడు భవన ద్వారము ముందు నిలిచి నిరీక్షించుచుండెను. కాని దూరము నుండియే కుమారుని ముఖలక్షణములను బరికించి చూచి సిద్ధన చిత్తము సంశయాయత్తమయ్యెను. "ఇది యేమి? వీని వదనమున విజయచిహ్నములు గానుపించుటలేదే! వీని యునికి యపజయమును సూచించుచున్నదే! ఏమేమి యనర్థములు వాటిల్లినవో! ఒకవేళ సమరపరాఙ్ముఖుఁడై శత్రువులకు వెన్నిచ్చి వచ్చుటలేదుగదా! ఏమీ సిద్ధన నందనుం

జంతటి యకార్యమునకు సిద్ధపడునా! ఏమొ! ఎట్టి యవాచ్యములు వినఁబోవుచున్నానో!" యని వెక్కివెక్కి పడుచు డోలాందోళిత హృదయుఁడై యున్నంతలో తిక్కన యింటి సమ్ముఖమునకు వచ్చి యశ్వముపైనుండి క్రిందికి దుమికెను. తన ముద్దులబిడ్డ తన్ను వీరమాతను గావించి విరోధిసేనానీకమును గసిమసంగి వచ్చియున్నాఁడని ప్రోలమాంబయు, తన భర్త తనకు వీరపత్నీ గౌరవమును గట్టిపెట్టుటకై విచ్చేసినాఁడని తిక్కనయర్ధాంగి చానమ్మయును లోపలినుండి పరుగెత్తుకొని వచ్చిరి.

కాని వారెంత యుత్సాహముతో వచ్చినారో యంత నిరుత్సాహ మెదురైనది. తిక్కన ముఖమండలమున నెంత వెదకినను విజయలక్షణములు గానిపించుటలేదు. ఆతని చూపులలో నడకలలో గర్వరేఖలు కానవచ్చుట లేదు. పరాజయ చిహ్నము లాతని కన్నులలో స్పష్టముగఁ బ్రతిఫలించుచుండెను. తిక్కన గుఱ్ఱమునుదిగి తండ్రివైపు గాని తల్లివైపుగాని చూడలేదు. ఎవ్వరితోడను మాటాడ లేదు. అట్లే తలవంచుకొని చెఱచెఱ లోనికివచ్చి గృహాంత ర్భాగమున గోడకానుకొని కూలఁబడెను.

సిద్ధనామాత్యుఁడు విన్నఁబోయిన కుమారుని యాననము వంకఁ జూచుచు "తిక్కా! ఇట్లున్నావేమి? విశేషము లేమియు లేవుగదా! సంగర మేమిచేసి వచ్చితివి" అని ప్రశ్నించెను. కొడుకు తండ్రిప్రశ్నకు సమాధాన మీయను లేదు. అట్లే విన్నమవదనుఁడై నేలఁ జూచుచుఁ గూర్చుండి

యుండెను. ఏనాఁడును గని విని యెఱుంగని తనయుని పరాజయ పరిక్లిన్నవదనమునకుఁ దల్లి యుల్లము తహతహలాడి పోయినది. ఇఁక తిక్కనభార్య యొక్కక్షణమైన నక్కడ నిలువలేకపోయినది. భర్త ప్రతిపక్షులకు వెన్నిచ్చి పరాభూతుఁడై పరుగిడివచ్చినాఁడన్న విషయ మామె గ్రహించుట కెంతోకాలము పట్టలేదు. ఒకమాటు తన విభుని ముఖమువైపు చుఱచుఱ చూచి చెఱచెఱ గృహాంతర్భాగమునకుఁ బోయి యా వీరనారీశిరోమణి "తానొక పిఱికి పందకు భార్యనై వీరపత్నీగౌరవమును గోల్పోయితిని గదా" యని చింతింపసాగెను.

జనకుఁడు తనయునిఁ జూచి "కుమారా! ఎంతటి యకార్య మొనరించితివి? ఇదియేనా వీరలక్షణము? నీకు నేర్పిన విజయగాథ లన్నియు నే గంగలోఁ గలిపివచ్చితివి? నా కడుపున సింహకిశోరము జన్మించిన దనుకొంటిని కాని జింకపిల్ల పుట్టిన దనుకొనలేదు. నీమూలముగా మా కొట్టరువు వంశమునకును, మనుమసిద్ధి మహీనాథుని సింహాసనమునకును, విక్రమసింహపురమునకును, తుదకు నాంధ్రభూమికే యపయశస్సు వాటిల్లినదిగా! నే నింక రాజేంద్రుని ముఖమెట్లు చూడఁగలను? నీ యన్న కవితిక్కన నీ చర్యలు విన్న నెంత చింతించునో యోచించితివా! సమరరంగమున శత్రువులను జంపవలయును లేదా వారిచేఁ జావవలయును. ఇది వీరధర్మము. వీరధర్మమును బరిత్యజించి కాందిశీకుఁడవై కాలికి బుద్ధిసెప్పుట హేయము గాదా? తిక్కా! నీవు నీ యక్రమ ప్రవర్తనచే విక్రమపుర విఖ్యాతిని మట్టిపాలు

స్తివి." యని కర్కశస్వరముగఁ బలికి నడిపోసికొని లోపల తలుపువేసికొనెను.

ప్రోలమాంబ కొంతసేపు కుమారునిఁ జూచుచు నిలువఁబడినది. తన భర్త పలికిన వాక్యములకుఁ జాల నొచ్చుకొనినది. తన తనయుని యనాలోచిత భీరుత్వ ప్రదర్శనమునకు లోలోనఁ గుందినది. మెల్లఁగాఁ గుమారుని సమీపించి పైఁటచెఱఁగుతో ముఖమునందలి స్వేదబిందువులఁ దుడుచుచు నిట్లు పలికినది.

"తండ్రీ! ఎప్పుడును లేని హృదయదౌర్బల్య మీనాఁడు నీ కెక్కడినుండి దాపురించినదోయీ? కలనైన నెఱుఁగని యీ పిఱికితనం బెవరు నూరిపోసిరోయీ? ఇంతకుముం దెన్ని సారులు వీరాధివీరుఁడవై రణరంగమున కేఁగలేదు! ఎన్ని మారులు వైరులపీఁచ మణంచలేదు! ఎన్ని పర్యాయములు విజయలక్ష్మీ సమలంకృతుఁడవై నాకన్నుదోయికి విందు సేయలేదు! ఈ దిన మింత బేలవై తూలివచ్చితివేమి? మన వీరులందఱు నేమైరి? నీ యఖండపరాక్రమ మేల మొక్కవోయినది? నీ ధైర్యసాహసము లన్నియు నే సముద్రములోఁ గలసె? అదుగో అటు చూడుము! విజయశ్రీ విరాజితుఁడవై నీవు విచ్చేయుసమయమున నీకు నెదురుగవచ్చి స్వాగత మీయవలయు నను నుబలాటముతో, కోడలు పళ్లెరము నిండ పూలదండల నెట్లమర్చియున్నదో! నీ విట్లు భీరువవయి పాఱిపోయి వచ్చితివన్న నా వీరాంగన హృదయ మెంత యుడికిపోవుచున్నదో! నాయనా! మీ నాయన మాటలకుఁ గష్టపడకుము. అయినదేదో అయినది. లే! స్నానముచేసి రెండు మెతుకులు తినుము" అని తల్లి లోనికిపోయి స్నానము

చేయుటకై ఖడ్గతిక్కనకు నుష్ణోదకము సిద్ధముచేయుమని కోమలికిఁ జెప్పినది.

తిక్కనకు మాతృహృదయములోని బాధ యవగతమైనది; తండ్రి పలుకులలోని భావము తెల్లమైనది. సతీమణి తిరస్కారదృష్టిలోని యంతరార్థము గొంతవఱకు బోధపడినది. అతని మానససరోవరమున నెన్నియో కల్లోలములు లేచినవి.

"ఈ నాఁడు విధివశమునఁ బ్రాప్తించిన పరాజయమునకుఁగదా యీ పరాభవమంతయును! నిజమే రణరంగమునఁ బురోగమించుట వీరలక్షణముగాని తిరోగమించుట భీరులక్షణముగాదా! నా కేల ఈ బుద్ధి తోఁచలేదు? శత్రువుల మాయావాక్యములకు లొంగిపోయి నేనేల గృహోన్ముఖుఁడనైతిని? అట్లే శక్తికొలఁది పోరాడి సంగ్రామక్షేత్రమునఁ బ్రాణములు వీడిన నన్ను వీరందఱును వీరశిఖామణి యని వేనోళ్లఁ బొగడియుందురుగదా! నా తల్లి యుల్లమునఁ బుత్రదుఃఖమునకంటె వీరమాతనన్న సంతోషమే యధికమై యుండెడిదిగదా! నే నిట్లు మగిడివచ్చితి నన్నమాట విన్న మనుమసిద్ధిమహీనాథుఁ డెంత బాధపడునో! అన్న తిక్కనామాత్యుఁ డెంత చింతించునో! న న్నెంత దూషించునో! ఆ మహానుభావుని వదన మెట్లు చూడఁగలను? ఇప్పుడు కర్తవ్యమేమి? మఱల నశ్వము నధిరోహించి సైన్యములను బిలిచికొని సమరభూమి కరుగుదునా! ఆహా! ఈ గాయములనుండి రక్త మింకను స్రవించుచునే యున్నదే! నా పంచకళ్యాణి యింకను రొప్పుచునే యున్నదే! నా సేన లొకింత

యాయాసమునైనఁ దీర్చుకొనవలదా! ఊరక రణరంగమునఁ బురుగువలెఁ జచ్చుటయే వీరధర్మమా! యుక్తాయుక్త వివేకము వలదా! శక్తి చాలనప్పుడు తొలఁగిపోయి వెండియు సేనలఁ గూర్చుకొని వీరవిహారము సేయుటకు సంగ్రామ శాస్త్రవేత్త లొప్పుకొనరా? సాధ్యమయినంతవఱకు విజయ లక్ష్మిని బడయు నుపాయమును దృష్టిలో నుంచుకొని ప్రవర్తించుటయుఁ బాపమయ్యెనా? ఈ యాలోచనతోడనే కదా నేను సుంత విశ్రాంతిదీసికొని మఱలఁ గ్రొత్తసైన్యములను సమీకరించుకొని సమరరంగమునఁ బ్రవేశింపవచ్చునని పురాభిముఖుఁడనైతిని. "జయాపజయమ్ములు దైవాధీనము" లనినైనఁ దలంపక నగరవాసు లందఱు నన్ని ట్లవమానింతురా? ఒకవేళ వారు తెలియ కట్లు పరాభవించినను నన్నుఁ గన్న జననీజనకులును, నా హృదయేశ్వరియు నా స్వభావమును గొంచెమైనను గుర్తింపక పిఱికిపంద యని భావింతురా! రవ్వంత సేదతీర్చుకొని వెండియు భండన భూమికిం జని ప్రతిపక్షుల చించి చెండాడెదంగాక."

అని తనలోఁ దాను తలపోసికొనుచు కవచమును విడిచి, ఖడ్గమునుగడిగి శుభ్ర మొనర్చి గదిలోని దేవుని యఱుఁగుముం దుంచుచుండెను. ఇంతలో "స్నానము చేయుఁడు. దొడ్డిలో వేఁడినీరు సిద్ధముగానున్న" దను శబ్దము వినవచ్చెను.

ఆ మాటలు తన యర్ధాంగలక్ష్మివే యని కంఠస్వరమును బట్టి తిక్కన గుర్తించినాఁడు. కాని యా సతీశిరోమణి

సహజసుఖకరములైన వాక్కుల మెత్తఁదనములో నేఁడొక క్రొత్తఁదనము నుండుట గమనించి స్నానోచితవస్త్రములను ధరించి యాతఁడు దొడ్డిలోనికిఁ బోయెను. అచ్చట నొక మరాల శాకరపాసుదగ్గఱగా నొక యెత్తుపీఁటవేసి కొన్ని బిందెలనిండ నుష్ణోదక మమర్పఁబడియుండెను. కొంచెము దూరములో నొక చిన్న పీఁటపై నాకుదొన్నెలోఁ బసుపు ముద్దయును, పెసరపిండియు నుంచఁబడియుండెను. తిక్కన కిదియంతయును మిక్కిలివిచిత్రముగాఁ దోఁచెను. ఆతఁడు పీఁటపైఁ గూర్చుండి బిందెలోని నీరు ముంచుకొనఁబోయెను. ఆ నీటినిండ వేపాకులు, తములపాకులు వేయఁబడియుండెను. ఇంతలోఁ దిక్కనభార్య యొక నులకమంచమును గొనివచ్చి భర్తగారి కడ్డముగాఁబెట్టి దానిపై నొక కంబళిని గప్పెను.

తన సతీమణి చేయుచున్న విచిత్రకృత్యముల కెంతయు విస్మయమంది తిక్కన "ఇదియంతయు నేమి? నేఁటి నీ చర్య లన్నియు నద్భుతముగానున్నవే?" యని భార్యను బ్రశ్నింప నామెయు "నిందు విచిత్ర మేమున్నది? నేను దమకుఁ దగినట్లె యేర్పాట్లుగావించితి" ననెను. తిక్కన కొంచెము కోపముతో "నిదేమి? నేనేమి యాఁడుదాన ననుకొంటివా! ఈ పసుపుముద్ద లేమి? ఈ తెరచాప లేమి?" యని యడిగెను.

ఆయన భార్య పతివాక్యముల కొకింత మందహాసము గావించి "నిజమే! తము రాఁడువారుగాక మగవారని యెవ రనుకొనఁగలరు? శత్రువులకు వెన్నుచూపినవారు స్త్రీలుగాక పురుషు లగుదురా? ఈ యింటియం దింతకుముం దిరువుర మే

స్త్రీల మున్నామనుకొంటిమి. నేఁడు తమతో మువ్వుర మైనాము. కాన సిగ్గుపడు టెందులకు? స్నానము గానిం" డని పలికి యొకమాఁటు నిర్లక్ష్యభావముతో పతి వదనము వైపు వీక్షించి లోనికిఁ బోయెను.

భార్య పలికినమాటలు కత్తిపోటులవలె నా వీరాగ్రేసరుని హృదయమునకుఁ దగిలెను. అతని కన్నులముందు ప్రపంచమంతయుఁ గిఱ్ఱున నొకమాఁటు తిరిగిపోయినట్లుండెను. నోట మాట వెలువడుటయే కష్టమయ్యెను. మిన్నువిఱిగి నెత్తిపైఁ గూలినట్లయ్యెను. అతి కష్టముతో నతఁ డేదో విధముగ స్నానమును ముగించుకొని భోజనమునకై వంట యింటిలోనికిఁ బోయెను.

తల్లియగు ప్రోలమాంబిక వెండిపళ్ళెములో నన్నమును వడ్డించి ప్రక్కఁ గూర్చుండెను. తిక్కన తల్లిని దలయెత్తి చూడఁజాలక యట్లే యవనతముఖముతో వచ్చి పీఁటపైఁ గూర్చుండి భోజనముసేయ నారంభించెను. కాని ముద్ద లోనికిఁ బోలేదు. దుస్సహాపరాభవపరితప్తమానసుఁడగు నా వీరున కన్న మెట్లు రుచించును? ఎట్లో రెండు ముద్దలు నోట వైచుకొని మజ్జిగఁబోయుమని తల్లి నడిగెను. ఆమెయు నొక పాత్రములో విఱిగిపోయినపాలను గొనివచ్చి కుమారుని కంచములోఁ బోసెను. అది గాంచిన తిక్కన యులికిపడి "అమ్మా! ఇదియేమి? విఱిగిపోయినపాలు పోసితివేమి?" అని యడిగెను. ప్రోలమాంబయు "నాయనా! నీ పితృపితామహాదు లందఱు పిఱికికండ యెఱుఁగనివారు. వా రెప్పుడును సంగ్రామ

రంగమున శత్రుసైన్యములకు వెన్నుచూపి పాఱిపోయి రాలేదు. ఈనాఁటికి మా వంశోద్ధారకుఁడవైన నీవు పుట్టి పౌరుషము తఱిగి విఱిగి పరుగిడివచ్చితివి. కనుకనే [illegible]లు పసువులపాలును విఱిగిన" వని యెత్తిపొడిచెను.

గోరుచుట్టుపై రోఁకటిపోటువలె పత్నీపరాభవ పరితప్త హృదయుఁడగు తిక్కన కీ యవమానము సహింపరాని దయ్యెను. అతఁ డంతటితో భోజనమును ముగించెను. ఇఁక నొక క్షణమేనియు నా గృహములో నిలువఁజాలకపోయెను. తాను గావించిన పని యెంతటి యవమానకరమైనదో యాతని కిప్పుడు బాగుగా బోధపడెను. వెంటనే కవచమును దొడిగికొని, ఖడ్గమును కెంగేల ధరించి, యిష్టదైవతమునకు నొక్కపర్యాయము హృదయపూర్వకముగా నమస్కారము నొనరించెను. ఆ దేవత చరణములందలి పూజాకుంకుమమును భక్తిపూర్వకముగా ముఖమున ధరించి ప్రళయకాలభైరవుని విధమున దేవమందిరమునుండి వెలుపలికివచ్చి యశ్వము నాయత్తమొనర్పుమని సేవకుని కాజ్ఞాపించెను.

ప్రాణనాథుని నూతన రణోత్సాహమును దిలకించి యాతని యర్ధాంగలక్ష్మియగు చానమ్మ యత్యంతసంతోషముతో మూర్తీభవించిన యుత్సాహశక్తివలెఁ బతి సాన్నిధ్యమున కరిగి తదీయ పదకమలములకు నమస్కారము లాచరించి "నాథా! ఈనాఁడు నేను గావించిన యవమానమునకుఁ గినుక నందకుఁడు. నిరుత్సాహముతోఁ దిరిగివచ్చిన మీకుఁ దిరిగి యుత్సాహము నుప్పొంగించు నుద్దేశముతో నట్లు

పలికితినిగాని యన్యముగాదు. నేను పలికిన కార్యములకు నన్ను దయతో క్షమించుడు. పురుషులకుఁ బౌరుషమేక ప్రాధానము. పాంచభౌతికమగు నీ దేహము శాశ్వతముగాదు. యశశ్శరీరము మాత్రమే శాశ్వతము. కనుక వీరాధివీరుడవై శత్రుసేనాసమూహములఁ బాఱఁద్రోలి యాత్మగౌరవమును నిలఁబెట్టుకొనుఁడు. జన్మభూమిని బరులపాలు గావింపకుఁడు. "జననియును జన్మభూమియును స్వర్గమునకంటె నుత్తమోత్తమము"లని పెద్దలు చెప్పుదురుగదా! ఇది తెలుఁగుగడ్డ. తెలుఁగుగడ్డలోఁ బుట్టిన తెలుఁగుబిడ్డ పిఱికికంద యెఱుఁగఁడను ప్రతిష్ఠను గాపాడుఁడు" అని పలికెను.

రణతిక్కనయు వీరనారీలలామయగు నర్ధాంగి పలుకు చున్న యుత్సాహ సముత్తేజకములగు నుద్రేకవాక్యములను విని యానందించి యామెను వీడ్కొని జననీజనకుల చరణ కమలములకు సాష్టాంగ నమస్కారము లాచరించి వారి యాశీర్వాదముల నందుకొని యశ్వము నెక్కి కోటలోనికిఁ జనియెను.

దుర్గమునఁ బ్రవేశించి రణభేరిని మ్రోఁగించెను. సమర సన్నద్ధులై యశ్వముల నధిరోహించుచున్న తన యోధాగ్రేసరులతో నెలుఁగెత్తి యిట్లు పలికెను: వీరాధివీరులారా! యాలసింపక యాలమునకు సంసిద్ధులు కండు. ఈ నాఁటితోఁ గాటమరాజు గర్వము నేలమట్టము గావింపవలయును. లేదా మన మందఱమును రణరంగమునకు బలియైపోవలయును. హరిహరనాథుని యనుగ్రహమున ననాయాసముగనే యరాతి

సంచయములఁ జించి చెండాడి ధర్మముగా మనకు రావలసిన పుల్లరిని మనము గైకొనఁగలము. భగవంతుఁడనుకూలింపఁడా, మన వీరధర్మమును మనము నిర్వర్తించుకొన్నవారల మగుదుము. లెండు; లెం"డని ప్రబోధించునంతలోనే సైనికు లందఱు వీరావేశపరవశులై తమతమ యాయుధములు ధరించి ద్విగుణీకృతోత్సాహముతోఁ దమ సేనానాయకు ననుగమించిరి.

మరలఁ గొలఁదికాలములోనే రణోచిత వీరవేషములను ధరించి రూపొందిన శౌర్యధైర్యములో యన శత్రువులపైఁ జనుచున్న యోధాగ్రేసరులను గాంచి పౌరులందఱు జయజయ ధ్వానములు సలిపిరి. అపరరుద్రునిభంగి సంగరోద్రేకముతో సైన్యములముందు నడచుచున్న ఖడ్గతిక్కనను సందర్శించి యింతకుముందు తా మనాలోచితముగ నాయనను గూర్చి పలికిన నిందావాక్యములకుఁ బశ్చాత్తాపపడిరి. ఈ పర్యాయము తప్పక జయము మనకే కలుగఁగలదని యాశించిరి.

---

## ౬

రణతిక్కన చమూసమేతుఁడై యనతికాలముననే సమరరంగమును సమీపించెను. నెల్లూరు సైన్యమును దూరముననే సందర్శించి కనిగిరిసైనికులు కడుంగడు విస్మయ మందిరి. పరాభూతులై పారిపోయినారుగదా యని తమ యాయుధముల నెల్ల నొక్కచో నుంచి వారు విశ్రమించు

చుచుండెను. కాటమరాజు ప్రగల్భములు పలుకుచు తన సైనికుల శౌర్యధైర్య సాహసములను పలువిధములఁ బ్రశంసించుచుండెను. ఆకస్మికముగ రణభేరి మ్రోఁగుటచే వారందఱు నాశ్చర్యపడుచున పకితులైరి. శాంతముగ నున్న సైన్యసముద్రము సంచలితమై పోయెను. కాటమరాజు వెంటనే యాయుధములను ధరించి సంగ్రామభూమికిఁ జనుదెంచని యాత్మ సైన్యమున కాజ్ఞాపించెను.

ఉభయసైన్యములకును మరల భయంకర సంగరము ప్రారంభమయ్యెను. ఎవరికివారు తామే విజయలక్ష్మిని తప్పక వరింపఁగలమని ప్రాణముల నరచేతిలోఁ బెట్టుకొని కెట్లించిన యుత్సాహముతో వీరమూర్తులై విజృంభింపసాగిరి. ఆనాఁటి రణతిక్కన సంగరోత్సాహము వర్ణనాతీతము. ప్రళయకాలమున ఫాలనేత్రము దెఱచిన పరమేశ్వరుఁడగు త్రిశూలపాణివలె నతఁడు శాత్రవ దుర్నిరీక్ష్యుఁడై విరాజిల్లుచుండెను. రిపునికాయ మాయన యనన్యసామాన్య విక్రమ విజృంభణము నవలోకించి "యితఁడు ద్రోణాచార్యుఁడా, యశ్వత్థామయా, యర్జునుఁడా, యభిమాన్యుఁడా" యని వెఱుఁగుపడుచుండిరి. ఆయన హుంకారమునకుఁ బగవారి గుండెలు బ్రద్దలగుచుండెను. ఆయన సింహగర్జలకు కనిగిరి సైనికుల కర్ణరంధ్రములు గింగురుమనుచుండెను.

ఇట్లు లా వీరాధివీరుఁడు విజృంభించి శత్రువుల కెల్ల మొదలఁ దానయై కనుపట్టుచు హస్తమునందలి భయంకర కరవాలమును గిరగిరఁద్రిప్పుచు "నిలుఁడు నిలుఁడు! పోకుఁడు

పోకుఁడు!" అని హెచ్చరించుచు నప్రతిమాన రణోన్మాదముతో పైఁ బడుచు నిజఖడ్గమునకు ప్రత్యర్థిబృందముల నెంద ఱెందఱనో యాహుతి గావించుచుండెను. ఆ శూరశిరోమణి ప్రోత్సాహ వాక్యములకు మహోత్సాహమునందుచు విక్రమపుర వీర సైనికులు కనిగిరి సైనికులపైఁ బడి చెల్లాచెదరొనరించు చుండిరి. సంగరము భయంకరమయ్యెను. ఖడ్గతిక్కన ఖడ్గ ప్రహారములకు వైరివీర మస్తకము లెన్నియో బంతులవలె నాకసమున కెగిరిపోవుచుండెను.

నడుమ నడుమ తిక్కన సైనికుల నిట్లు ప్రబోధించు చుండెను: "వీరసైనికులారా! విజృంభింపుఁడు! వెనుదీయకుఁడు! న్యాయమునకై మీ ప్రాణముల నొడ్డుఁడు. భండనమునుండి పాఱిపోయితిరా మీ జన్మభూమి పరులపాలగును. మీరాజ్యము కాటమరాజు స్వాధీనమగును. మీరు పరతంత్రులగుదురు. పరతంత్రులగు ప్రజలు పలుకష్టముల పాలగుదురు. స్వాతంత్ర్యములేని జన్మమెందులకు? మీ పౌరుషమును ప్రకటింపుఁడు. మనుమసిద్ధిమహారాజునకుఁ గళంకమును దేఁబోకుఁడు. విక్రమసింహపురము విఖ్యాతి నిలఁబెట్టుఁడు."

ఇవ్విధముగాఁ దమ్ముఁ నుత్సాహవాక్యములతోఁ బ్రబోధించుచున్న తిక్కన దండనాథుని యాజ్ఞానుసారముగా నెల్లూరి సైనికులు కండలు తెగి పడుచున్నను రక్తధారలు ప్రవహించుచున్నను లెక్కసేయక శత్రువులను జక్కాడు చుండిరి.

రెండు పక్షములయందును సైనికులు కుప్పలు కుప్పలుగాఁ గూలిపడుచుండిరి. ఇంతలోఁ గాటమరాజు సేనా

నాయకులలో నొకఁడగు పిన్నమనాయఁడు ముందు కురికించి ఖడ్గతిక్కనతో నిట్లు పలికెను: "భూసురాగ్రణీ! పోరు నిలుపుము. మీరు బ్రాహ్మణులు. మేమో యాదవులము. మీకును మాకును యుద్ధము యుక్తము కాదు. క్షత్రియోచితమైన సంగ్రామము ధరణీసురులకు శోభనిచ్చునా? మిమ్ముఁ జంపినచో బ్రహ్మహత్యా మహాపాతకము మాకుఁ బ్రాప్తించునుగదా."

ఇట్లు వినయముతోఁ బలుకుచున్న పిన్నమనాయనిం గాంచి ఖడ్గతిక్కన "ఓయీ! సమరము సల్పలేక ఏల నీ రీతి ధర్మవాక్యముల నుగ్గడించెదవు? నీ యుపాయము నా కర్థమైనది. నీ వనవసరముగ నాలస్యము చేయించుచున్నావు. నా కరవాలమున కడ్డువచ్చి యీలోపుగా మీ సైన్యములచే మా సైన్యములను సంహరింపఁజేయఁ దలపెట్టితివా? శూరత్వమునకు జాతితోఁ బనియేమి? జగదేకవీరుఁడైన పరశురాముఁడు బ్రాహ్మణుఁడుగాఁడా? కురుపాండవ ధనురాచార్యుఁడైన కుంభసంభవుఁడు బ్రాహ్మణుఁడుగాఁడా? చాలు చాలు తొలఁగిపొమ్ము. మా పుల్లరిని మాకొసంగునట్లు కాటమరాజునకు హితోపదేశము సేయుము. లేదా వీరోచితమగు సంగ్రామమునకు సిద్ధమగుము. మెట్ట వేదాంతములు కట్టిపెట్టు" మని పట్టువిడువక సాహసాతిరేకముతో సింగపుఁగొదమవలె ముందుకు దుమికెను.

రణతిక్కన వీరవిహారమునకు విస్మయమంది కాటమరాజాదు లెవ్వరును నా శూరశిరోమణిని సమీపించలేక

పోయిరి. సర్వసేనానాయకుఁడగు బ్రహ్మరుద్రయ్య యాత్మ సైనికుల యపజయమునకు సహింపలేకపోయెను. వెంటనే యాతఁడు గుఱ్ఱముపైఁ జొచ్చుకొనివచ్చి ఖడ్గతిక్కన నెదుర్కొనెను. అనుపమాన వీరాగ్రగణ్యులగు వా రిరువుర ద్వంద్వయుద్ధమును గాంచుటకు నుభయసైన్యములును యుద్ధము చాలించినవి.

ఇరువురును మహావీరులే! ఇరువురును బ్రాహ్మణవంశ సంజాతులే! ఇరువురును దమరాజుకొఱకుఁ బ్రాణములు బలి గావింపఁ గృపాణములు ధరించి సంగ్రామరంగమున కుఱికిన వారే! కొంతకాలమువఱకు నశ్వములపై నెక్కి యొకరికంటె నొక రెక్కుడు మగంటిమిఁ బ్రదర్శించుచు సమరము గావించిరి. అనంతర మా మేటివీరులు ఘోటకముల మీఁదినుండి క్రిందికి దుమికి ఖడ్గయుద్ధమును బ్రారంభించిరి. కత్తిపోటులవలన నిరువుర శరీరములనుండి నెత్తురు చిమ్మించి కొట్టుచుండెను. అరుణారుణ నేత్రాంచలములతో, నన్యోన్య పరాక్రమాభినందనములతో, నసమాన ధైర్యసాహసములతో, నఖండితోత్సాహములతో, నకుంఠితరాజభక్తితో నా వీరద్వయము పోరఁదొడఁగినది.

వారి యుద్ధము భారతకాలమునాఁటి యభిమన్యు లక్ష్మణకుమారుల యుద్ధమువలె నుండెను. ఇట్లు కొంతవడి వా రిరువురు ఖడ్గములతోఁ బోరాడి తుట్టతుదకు పరస్పర కరవాలములకు బలియై యిరువురును నేలపైఁ బడిరి.

రెండుసైన్యములయందును తమ నాయకుల మరణ మునకు హాహాకారములు మిన్నుముట్టెను. అట్లు మృతుఁడై పడియున్న రణతిక్కన శిరమును నోటఁగఱచుకొని యాతని యశ్వరాజము విక్రమసింహాపురమునకుఁ బరుగెత్తుకొనివచ్చి సిద్ధనామాత్యుని భవనద్వారము ముందు దాని నునిచెను.

ఆ విషాదదృశ్యము నంతయును నవలోకించుచున్న విక్రమసింహాపురవాసులు తమ దండనాయకుని మరణమునకు మిక్కిలి దుఃఖించిరి. తిక్కన తలిదండ్రులు కుమారుని మృతికిఁ గొంతవడి సంతాపమునందియు వాని వీరోచిత మరణమునకు సంతసించిరి. రణతిక్కన భార్య తన ప్రాణ నాథుని శిరస్సును కన్నుల కద్దుకొని యా శీర్షముతోఁ బాటు సహగమనము గావింపఁదలఁచెను.

చితి సిద్ధమైనది. వీరాధివీరుఁడగు రణతిక్కన శిర మా చితిమధ్యమున నుంచఁబడినది. తిక్కన భార్యయగు చానాంబ పసుపుకుంకుమములు ధరించి పుష్పమాలాలం కృతయై తన పతి శిరమునకు మూఁడుమారులు ప్రదక్షిణ మాచరించి కన్నులు మూసికొని యందుఁ బ్రవేశించినది. తన ప్రాణనాథుని యుత్తమాంగముతోఁ బాటుగా ఆ యుత్తమ వీరసాధ్వీమణి యగ్నిజ్వాలలలో భస్మమైపోయినది.

మనుమసిద్ధిభూపాలుఁడు మహావీరుఁడగు తన సేనా నాయకుని మరణవార్తకు పరితపించి తిక్కన తల్లిదండ్రులను, అన్నయగు కవి తిక్కనను సాంత్వనవాక్యములతో నూఱడించి యఖండసేనాసమేతుఁడై సంగరరంగమున కరుదెంచెను.

అప్పుడు తిక్కనసేనాని విక్రమమును బ్రదర్శించుచు గతాసువులై కుప్పలుకుప్పలుగాఁ బడియున్న కాటమరాజు సైన్యమును దర్శించి తన వీరసేనాధిపతి యసాధారణ పరాక్రమమును కన్నారఁగని మెచ్చుకొనుచు విరోధులను చించిచెండాడి విజయలక్ష్మీసహితుఁడై నిజనగరమునకు విచ్చేసెను. మనుమసిద్ధిభూపాలుఁడు ఖడ్గతిక్కన విజయమును దేశమంతయుఁ జాటించెను. పుత్రసంతాపసంతప్తమానసు లగు తిక్కన జననీజనకులకును, సోదరమృతికి వ్యథనందుచున్న కవితిక్కనకును నూఱటకలుగునట్లు రణతిక్కన స్మృతి చిహ్నమును పినాకినీతీరమున నిర్మించెను.

ఖడ్గతిక్కన చరిత్రము పూర్తియైనది. ఆయన వీర నామాక్షరములు తెలుఁగు వీరులచరిత్రలో మొదటిపంక్తిలో లిఖింపఁబడినవి. ఆ శూరశిఖామణి పౌరుష మాంధ్రవీరుల కాదర్శప్రాయము. ఇట్టి వీరకుమారులను గన్న తెలుఁగుతల్లి ధన్యురాలు.

# రుద్రమదేవి

## ౧

ఆనాఁడు విజయదశమి. మనోహరమగు సంధ్యా సమయమున నోరుగల్లుపట్టణ వీథులన్నియు నానందోత్సాహములతో పొంగిపొరలుచుండెను. రాచనగరులో రాజకుమారుల యస్త్రవిద్యాప్రదర్శనమును సందర్శించుటకై నగరమందలి యాబాలగోపాలమును వడివడిఁ జనుచుండిరి. కాకతీయ గణపతిదేవచక్రవర్తి సామ్రాజ్యమునందలి సమస్త ప్రజలను, సామంతులను నా వినోదమును సందర్శించుటకై యాహ్వానించినాఁడు. వివిధప్రాంతములనుండియు దండనాథులు, సేనానులు, ప్రధానులు, సామంతరాజులును విచ్చేసి యథోచితస్థానముల నలంకరించియుండిరి.

ఆ కాకతీయసార్వభౌముని ప్రాభవౌన్నత్యముల కనుగుణముగా విద్యావినోదమంటప మలంకరింపఁబడి కన్నుల పండువు గావించుచుండెను. సభామందిరమంతయు ప్రేక్షకజనసమూహముతోఁ గ్రిక్కిఱిసియుండెను. మంటప మధ్యభాగమునం దమర్పఁబడిన యొక పచ్చల సింహాసనము సార్వభౌముని యాగమనమునకై నిరీక్షించుచున్నట్లుండెను. దానికిఁ గుడివైపుననున్న యున్నతాసనము మహాప్రధాని గోవిందామాత్యులవారికై యమర్పఁబడినది.

దుందుభి మ్రోఁగినది. తూర్యధ్వనులు చెలరేఁగినవి. చక్రవర్తి రాజసౌధమునుండి విద్యామంటపమునకు బయలు దేఱినాఁడు. ఆయనకు ముందుభాగమున నడచుచు మహా మాత్యుఁడు దారి చూపించుచుండెను. చక్రవర్తిరాక గమనించి సభ్యులందఱు వినయవినమితశిరస్కులై లేచి నిలుచుండిరి. అంగరక్షకుఁడైన యయ్యాపోతినాయఁడు కేల రాజదండము గొని నడువ, కాకతీయ గణపతిదేవచక్రవర్తి సభాభవనమును ప్రవేశించి పౌరసమూహమును గడచి సామంతరాజలోకము నతిక్రమించి సింహాసనమును సమీపించుచుండెను.

చక్రవర్తి చేతి నూఁతగాఁ గొని యొక ముద్దులు మూటగట్టు రాజకుమారుఁడు నడచి వచ్చుచుండెను. ఆ రాజకుమారుని సుందరసుకుమారరూపము సమస్తసభాసదుల నాకర్షించినది. సామంతరాజులందఱు ఆ బాలుని గంభీర వదనమును సాశ్చర్యముగాఁ దిలకింపసాగిరి. సేనానాయకుల దృష్టులా వీరకుమారుని చేతిలోనున్న కరవాలముపయిఁ బ్రసరించినవి.

చక్రవర్తి సింహాసనమునొద్దకు వచ్చినంతనే సభ యంతయు సగౌరవముగా నొక్క పర్యాయము మహారాజునకు జయజయధ్వనులు పలికి కూర్చుండెను. మహారాజును మందహాసము చిందిపోవు వదనముతో సభాసదులవందనముల నందుకొని సింహాసనమున నుపవిష్టుఁడయ్యెను. వెంటవచ్చిన రాజకుమారుఁడు మహారాజు సింహాసనమునకు నెడమవైపున నున్న రత్నపీఠముపైఁ గూర్చుండెను. మహామాత్యులవారును దక్షిణపార్శ్వమునన్న యాసనమును స్వీకరించిరి.

ఆ మహాసభయందు తమ విద్యావిశేషములను ప్రదర్శించి చక్రవర్తి మెప్పువడయుటకై రాజకుమారులు కొందఱు రంగస్థలమును ప్రవేశించిరి. గణపతిదేవచక్రవర్తి యనుజ్ఞనందుకొని ప్రదర్శనము ప్రారంభమైనది. పరంపరగా వర్షింపఁబడుచున్న బాణసమూహములవైపు ప్రేక్షకులు విభ్రాంతులై చూడసాగిరి. విధివిరామములులేక సాగుచున్న వీరశిఖామణుల శస్త్రాస్త్రప్రయోగచాతుర్యమును, బాణ ప్రయోగోపసంహారములును, గదాభ్రమణమును, ఖడ్గ సంచాలనవిలాసమును సభ్యుల నందఱ విస్మయానందముల నోలలాడించెను. రాజకుమారులగు మురారిదేవుఁడును, హరిహరదేవుఁడును తక్కుంగల వీరశిరోమణులకంటె మిన్నలై తమ యస్త్రవిద్యావిశేషమును ప్రదర్శించి చక్రవర్తి మెప్పు వడసి తమతమ యాసనములపై సగర్వముగఁ గూర్చుండిరి.

విద్యాప్రదర్శనము కొంత గడచినతర్వాత గణపతిదేవ చక్రవర్తి యఱచేతిలో నొక దంతపు బరణి నుంచుకొని “మురారీ! నా చేతిలోనుండి దీనిని క్రిందికిఁ బడగొట్ట వలయును. నా హస్తమునకుఁ గొంచెమైనను నీ బాణపు గాలి సోఁకరాదు. శరప్రయోగమున దంతపుబరణియును పగులరాదు” అని పలికెను. వెంటనే మురారిదేవుఁడు సరిగా గుఱిచూచి బాణప్రయోగ మొనరించెను. దంతపుబరణి క్రిందపడినది. చక్రవర్తి హస్తమునకు గాలి సోఁకలేదు. కాని బరణి క్రిందపడి విచ్చిపోయినది. సర్వవిధముల వెనుకటి దానినిఁబోలిన మఱియొక దంతపు బరణిని గుడిచేతియందుం దుంచుకొని “హరిహరా! నీవు ప్రయత్నించి చూడు”మని

చక్రవర్తి మఱల నాజ్ఞాపించెను. హరిహరుఁడు వింటబాణమును సంధించి ప్రయోగించెను. సంపూర్ణముగా నాతఁడా పరీక్షలో విజయమును సంపాదింపఁగల్గెను. గణపతిదేవచక్రవర్తి వెను వెంటనే తన మెడలోనున్న ముత్యాలహారముతో హరిహరుని బహూకరించెను.

ఈ విధముగా చక్రవర్తి మరికొంతసేపు విద్యావిశేషములను ప్రదర్శింపఁజేసి యనంతరము విలాసార్థముగాఁ దన చేతియందుఁ బట్టుకొనియున్న తామరతీఁగెను పెంపుడు పావురమునోటఁ గఱిపించి "కుమారులారా! ఇటు చూడుఁడు! ఈ పావురమును స్తంభోపరిభాగమున నుంచుచున్నాను. ఒక్కపర్యాయముగా మూఁడు బాణములను ప్రయోగించి దీని నోటిలోని తామరతూఁడు మూఁడుముక్క లగునట్లుగాఁ గొట్టవలెను. పావురము బాణవేగమునకు భయమంది పాఱిపోవరాదు. ఈ పరీక్షయందు త్తీర్ణులైనవారికి రత్న ఖచితమగు పిడితోఁ దళతళ మెఱయుచున్న యీ రాజఖడ్గము బహుమానముగ లభింపఁగల"దని యా కరవాలమును సభామంటప మధ్యమున వ్రేలాడఁదీయించెను. సభ్యుల దృష్టులన్నియు నా వజ్రమయ కరవాలముపై వ్రాలినవి. ఈ బహుమతిని గ్రహింపఁగల మహావీరుఁడెవ్వరో యని ప్రేక్షకులు కుతూహలముతో గాలిపీల్చుటకైన విరామము లేక వీక్షించుచుండిరి.

మురారికి ముందుగనే సందేహముకలిగి యాతఁడు ప్రయత్నింపలేదు. హరిహరుఁడు విజయగర్వముతోఁ

గార్ముకమున మూఁడు బాణములు దొడిగి బొమ్మువిఱచి నారి వెనుకకు వంగి లాగి వదలిపెట్టెను. అమ్ములు నిశ్శబ్దముగా ముందునకు సాగినవి. పావురమున కించుకయైన భయము గలుగలేదు. కాని శరములు తామరతూఁటిని తాఁకి క్రింద పడినవి. తూఁడు మూఁడుముక్కలు గాలేదు. హరిహరుఁడు సిగ్గుతోఁ దలవంచుకొనెను. సమస్తసభాసదులును నతనివంక చూచి పరిహాసము గావించుచుఁ జప్పట్లు గొట్టిరి.

అంతలో సభ మఱల నిశ్శబ్దమైనది. గణపతిదేవ చక్రవర్తి కరము సూఁతగాఁ గొనివచ్చిన పదునాలుగేఁడుల రాజకుమారుఁడు తన మణిమయపీఠమును డిగి నిలువఁబడెను. వీరరసము వెల్లివిరియుచున్న యా రాచబిడ్డ సుందరవదనార విందము గాంచి సభ్యులు ముగ్ధులైరి. చక్రవర్తి యాతనిఁ గాంచి చిఱునవ్వుతో "నాయనా! నీవు ప్రయత్నింతువా?" యని పలికెను. ఆ వీరకిశోరము దృఢనిశ్చయముతో నౌ నన్నట్లు 'తల యాడించెను. మహాప్రధాని గోవిందామాత్యుల వారు లేచి యా రాకుమారుని దీసికొనిపోయి రంగమధ్యమున నిలిపి తిరిగివచ్చి నిజాసనముపయి నుపవిష్టుఁడయ్యెను. చక్రవర్తి మఱల పావురమునోట మృణాళవల్లిక నునిచి స్తంభాగ్రముపై నిలఁబెట్టెను. రాకుమారుఁడు వింట నారి సంధించి సిద్ధపడెను. బాణప్రయోగమునకుఁ జక్రవర్తి యనుజ్ఞ నిచ్చినవెంటనే యొక్కమాటుగా మూఁడు వాఁడి ములుకులు వింటినుండి వెలువడినవి. గాలికే తెలియనట్లు నిశ్శబ్దముగా లక్ష్యమును జేరి మూఁడుముక్క లొనరించి చక్రవర్తికి నమస్కరించుచున్నవో యన్నట్లు చరణముల

ముందు వ్రాలినవి. గణపతిదేవచక్రవర్తి యపరిమితానంద ముతో రంగస్థలమున కేఁగి యా వీరకిశోరమును గౌఁగిలించుకొని కొనివచ్చి యంకభాగమునఁ గూర్చుండఁబెట్టుకొని వీరకరవాలమును స్వహస్తముతో బహూకరించెను.

సభాసదు లా బాలవీరునిమౌళిపైఁ బుష్పవర్షము గురిపించి పెక్కువిధముల నభినందించిరి. నలుమూలలనుండి జయజయధ్వనులు మిన్నుముట్టినవి. గోవిందామాత్యులు వచ్చి సప్రేమముగా నాబిడ్డ శిరము మూర్కొనెను. శస్త్ర విద్యాప్రదర్శనమహోత్సవము ముగిసినది.

---

## ౨

ప్రదర్శనానంతరము పట్టరానిసంతోషముతో నా రాచపట్టి చేయిపట్టుకొని గణపతిదేవచక్రవర్తి యేకాంత మందిరమున కేఁగెను. యాదవరాజుల కారాగారమునుండి తిరిగివచ్చి విశాలాంధ్రసామ్రాజ్యమున కభిషిక్తుఁడైన నాఁడైన గణపతిదేవచక్రవర్తి కింత యానందము కలుగలేదు. అరివీర భయంకరుఁడైన పల్లవరాజు కొప్పెరుంజింగని జయించి వానినిఁ దనపాదసేవకునిగాఁ జేసికొనిననాఁడైన నాయన ముఖపద్మ మిట్లు వికసింపలేదు. విద్యాప్రదర్శనము ముగిసిన మఱునిముసమునుండి చక్రవర్తి హృదయమునం దేదో యవ్యక్తమగు నూతనోత్సాహము వెల్లివిరిసెను. ఆయన వదనమండలము నావరించియున్న విచారరేఖ మటుమాయ మైనది.

ఏకాంతమందిరమునకుఁ జేరినయనంతరము గణపతి దేవచక్రవర్తి యా రాకుమారుని దగ్గఱకుఁదీసికొని ముద్దుగొని "తల్లీ! రుద్రమదేవి! ధనుర్విద్యయందు నీ కింతటి యఖండపాండిత్య మున్నదని యింతకుముం దెన్నఁడు మాట మాత్రమైన యనినావు కావేమి?" యని పలికెను. రాజకుమారవేషముతోనున్న రుద్రమదేవి నవ్వుచు "తండ్రీ! ఎన్నఁడును నా క ట్టి య వ కా శ ము లభింపకపోవుటయే కారణ"మని వచించెను. గణపతిదేవచక్రవర్తి తన ముద్దుల కుమార్తెను గాఁగిలించుకొని "అమ్మా! మీ విద్యాగురు వెవ్వరో యడుగవచ్చునా?" యనెను. రుద్రమ్మ సవినయముగా "గోవిందామాత్యులవారు" అని పలికెను.

గణపతిదేవచక్రవర్తి యీమాట నాలకించినతోడనే మిక్కిలి సంతోషము గలిగి మనస్సులోనే గోవిందామాత్యులకు భక్తిపూర్వకముగా నమస్కరించి "మహామంత్రీ! ఎంతటి దూరదర్శివి. మహారాజునకుఁ బుత్రసంతతి లేదను నూహావలననేనా రుద్రమకు మీ రిచ్చిన యీ శిక్షణ విధానము. కర్తవ్య విమూఢుఁడనైయున్న నా కన్నులకు వెలుఁగు చూపించి నా హృదయములోని నిరాశను దూరము చేసితి" రని యనేకవిధములఁ బ్రశంసించెను.

మహోత్తరమైన విశాలాంధ్ర సామ్రాజ్యమును సంస్థాపించి దేశమున శాంతి నెలకొల్పిన గణపతిదేవచక్రవర్తికిఁ బూర్వమొక్కనిమేషమైన హృదయశాంతి యుండెడిదికాదు. తన యనంతరము ప్రజాక్షేమకరముగా సింహాసనమునఁ గూర్చుండి రాజ్యమును బరిపాలించుటకుఁ దనకుఁ బుత్ర

సంతానము లేకపోవుటయే చక్రవర్తి నిరుత్సాహమునకు, విచారమునకు, నశాంతికిఁ బ్రధానకారణము. సవతి తమ్ముని కుమారులైన మురారి హరిహరదేవులలో నెవ్వరికైన రాజ్యము నప్పగించుట కాసార్వభౌముని హృదయ మంగీకరించక పోయెను.

ఇప్పుడు చక్రవర్తికి రుద్రమదేవి కుమార్తెగాదు, కుమారుఁడు. రాజకుమారుల యాభరణములే యామె యాభరణములు. రాజనందనుల దుస్తులే యామె దుస్తులు. రాజపుత్రుల యాటలే యామె యాటలు. జన్మముచేత నామె స్త్రీయైనను క్రమక్రమముగా నామె పురుషోచిత వేష భూషణములను ధరించి యొక యుత్తమ రాజకుమారునివలెఁ బ్రకాశించెను.

నాఁడు శస్త్రవిద్యాప్రదర్శనమునందుఁ దన నేర్పుచూపి చక్రవర్తిమన్ననలు పడసి వీరకరవాలమును బహుమానముగాఁ గైకొనిన రాజకుమారుఁడు నిజముగాఁ బురుషుఁడు గాఁడనియు గణపతిదేవచక్రవర్తి కుమార్తెయగు రుద్రమదేవియే పురుష వేషముతో నట్లు ప్రవర్తించుచుండెననియుఁ దెలిసికొని రాజ్యము నందలి ప్రజలందఱు మిగుల సంతోషించిరి. తమకుఁ జక్రవర్తి యనంతరము యోగ్యురాలైన మహారాజ్ఞి లభించుచున్నది గదాయని యొకవిధమైన సంతోషము వారల యంతరంగముల నుప్పొంగుచుండెను. తమ కాఁబోవు చక్రవర్తినిని గాంచినప్పు డెల్ల జనుల వదనములు నిరతిశయానందముతోఁ బ్రఫుల్లము లగుచుండెను. కాని యిరువురకు మాత్రము రుద్రమదేవి వీరవిహారము సంతోషదాయకము గాలేదు.

మురారియు హరిహరుఁడును నా యమ్మ పేరు విన్న నులికిపడుచుండిరి. మునుముందు సామ్రాజ్యమున కంతయు నామెయే అధికారిణియగు నన్నమాట వారేమాత్రమును సహింపఁజాలకుండిరి. ప్రజాముఖముల నామె స్తుతిపాఠములు విన్నప్పుడెల్ల నీర్ష్యతో ద్వేషముతో వారి హృదయములు దహించుకొని పోవుచుండెను.

కాకతీయ గణపతిదేవచక్రవర్తికి నానాఁటికిఁ దన వీరపుత్రికారత్నముపై ననురాగము పెంపొందసాగెను. రుద్రమదేవి గుఱ్ఱముపై నెక్కి యరణ్యములకుఁ బోయి వేఁటాడ నేర్చినది. ఖడ్గచాలనమున నసమానపాండిత్యమును గడించినది. రాజకార్యములందు సంపూర్ణ విజ్ఞానమును సంపాదించినది. నానావిధములగు యుద్ధపద్ధతులను గ్రహించినది. సామదానభేద దండోపాయముల నాకళించుకొన్నది. కామందక కౌటిల్యాది రాజనీతి శాస్త్రములు పఠించినది. గణపతిదేవచక్రవర్తి కొలువు దీర్చినప్పుడెల్ల పురుషవేష ధారిణియై రుద్రమదేవికూడ మహారాజుప్రక్క విరాజిల్లు చుండవలసినదే. ఆమెకొఱకుఁ బ్రత్యేకముగాఁ గొలువు కూటమున నొక సింహాసనము నిర్మింపఁబడినది. రాజకార్యములను బరిష్కరింపవలసివచ్చినప్పుడు రుద్రమదేవి లేనిది సార్వభౌముఁడు కొలువుతీరెడివాఁడు కాఁడు.

కాలము గడిచినకొలఁది రుద్రమదేవి రాజ్యపరిపాలనమున కావశ్యకములైన విద్యల నన్నింటిని నేర్చినది. తండ్రితో ననేక యుద్ధరంగములకుఁ దానుకూడ నేఁగి రాజనీతిని, సమర నైపుణ్యమును బ్రత్యక్ష ప్రమాణములతో నేర్చుకొనినది.

పూర్వము కాకతీయ గణపతిదేవుఁడు దక్షిణదేశమును జయించు కాలముననే కాంచీనగరము నాక్రమించియున్న పాండ్యులను బాఱఁద్రోలి యీ పట్టణమును స్వాధీనము గావించుకొని యుండెను. అచ్చటఁ దనకుఁ బ్రతినిధిగా గండగోపాలచోళుని నియమించివచ్చెను. ప్రస్తుతము గణపతిదేవచక్రవర్తి పెద్దవాఁడై పోయినాఁడనియు నాయన ప్రాభవము తగ్గిపోయినదనియు భ్రమించి పాండ్యులు తిరిగి కాంచీపురముపై దండెత్తివచ్చిరి.

ఆ విధముగా నెత్తివచ్చిన పాండ్యరాజులు నగరమును ముట్టడించి దుర్గమును స్వాధీనముగావించుకొని కాకతీయ సామంతరాజగు గండగోపాలునిఁ దఱిమివేసిరి. అంతటితో సంతృప్తినందక వారు విక్రమసింహపురము వఱకును నాంధ్ర సామ్రాజ్యములోనికిఁ జొచ్చుకొని వచ్చిరి. నిరుపమానశౌర్య ధనుఁడు, అభిమానవంతుఁడు, అనంత సాహసోపేతుఁడు, అఖండ తేజోవిరాజితుఁడును నగు గణపతిదేవచక్రవర్తి కది భరింపరాని యవమానమయ్యెను. పాండ్యరాజులను బాఱఁ ద్రోలి మరల గండగోపాలుని తమ ప్రతినిధిగా నిలిపిరాఁగల మహావీరు నక్కడకుఁ బంపవలయును. అట్టి మహోన్నత కార్యమును దీర్పఁగల సమర్థుఁ డెవఁడా యని చక్రవర్తి యాలోచించుచుండెను.

# 3

సార్వభౌముఁడు నాఁటి సాయంకాలము వజ్రసింహాసనముపైఁ గొలువుదీరినాఁడు. సమస్త సామంతరాజులతో, మహామంత్రులతో, సేనానాయకులతో నిండియున్న సభలో పాండ్యుల దుర్మార్గమును వివరించినాఁడు. పాండ్యరాజులకుఁ దగినట్లు శాస్తియొనర్చి బుద్ధిసెప్పఁగల వీరాధివీరుఁ డెవ్వఁడో లెండని ప్రశ్నించినాఁడు.

పాండ్యులన్న సామాన్యులుగారు. అప్రతిమాన శౌర్యవంతులు; అభిమానధనులు; రణవిద్యావిశారదులు. పాండ్యరాజుల జయించుటన్న ప్రతివారికిని భయమే. సార్వభౌముని ప్రశ్నమున కెంతసేపటికిని సమాధానము రాలేదు. "నేను పాండ్యులను జయించి మఱల కాకతీయ విజయపతాకను కాంచీపుర దుర్గగోపురముపై ప్రతిష్ఠాపింతు" నని ముందడుగు వేసి ధైర్యముగాఁ బలుకు యోధాగ్రేసరుఁ డెవ్వఁడును జక్రవర్తికిఁ గానుపింపలేదు.

మహారాజు ముఖము కోపముతో జేవురించినది. ఆయన పెదవు లదరసాగినవి. చక్రవర్తి తిరిగి ఏదియో పలుకఁబోవు చుండఁగనే పురుషవేషధారిణియగు రుద్రమదేవి లేచి "మహారాజా! నా కనుజ్ఞయొసంగి పంపినచో దుర్మార్గులగు పాండ్యుల పీఁచమడఁచి తిరిగి కాంచీపురమును బట్టుకొందు" నని మేఘగంభీరస్వరముతోఁ బలికెను.

గణపతిదేవచక్రవర్తి మహాశౌర్య ధైర్యవిరాజితులగు వీరసేనానాయకులను గొందఱను తోడిచ్చి రుద్రమదేవిని

పాండ్యులను జయించుటకొఱకుఁ గాంచీపురమునకుఁ బంపెను. కొలఁదికాలములోనే యాతఁడు పాండ్యులను జయించి యపరిమితములగు ధనరాసులను, నమూల్యములగు మణిమయహారములను, నసంఖ్యాకములగు గజతురగాదులను నపరాధముక్రిందఁ గైకొని మఱల గండగోపాలుని కాకతీయ సామ్రాజ్య ప్రతినిధిగాఁ గాంచీపురమున నిలిపి విజయలక్ష్మీవిరాజమానమై యేకశిలానగరమునకు విచ్చేసి తన విజయోపహారమును మహారాజు పాదములందు సమర్పించెను. తన పీరపుత్రిక ప్రథమవిజయమునకు చక్రవర్తినయనము లానందబాష్పములతో నిండిపోయెను.

ఆచారవ్యవహారములందును, బాహ్యవేషధారణమునందును, రుద్రమదేవి పురుషాకృతి ధరించియున్నను స్వభావముచేత నామె స్త్రీ. కావుననే సార్వభౌముఁడు దగినవరు నన్వేషించి యామెకు వివాహముగావింప దృఢనిశ్చయుఁడయ్యెను.

ఆంధ్రుల శక్తిసామర్థ్యములను కేంద్రీకరించి శాతవాహనుల యనంతరము విశాలాంధ్రసామ్రాజ్యమును సంస్థాపించినవాఁడు రాజరాజనరేంద్రుఁడు. ఆయన వంశస్థులలోఁ బ్రసిద్ధికెక్కిన చాళుక్య వీరభద్రేశ్వరుఁడు ప్రస్తుతకాలమున గోదావరీమండలమును బరిపాలించుచుండెను. గణపతిదేవచక్రవర్తి తన ముద్దులపుత్త్రి నా చాళుక్యవంశరత్నమున కిచ్చి వివాహము గావించెను. సుప్రతిష్ఠితమైన చాళుక్యవంశసంభవులతో వైవాహికసంబంధ మేర్పఱచుకొని

సుక్షత్రియచూడామణికిఁ గన్యాదాన మొనర్పఁగలిగినందులకు గణపతిదేవుఁ డపరిమితానందము నందెను.

రుద్రమదేవికి దాంపత్యసౌఖ్య మెంతోకాలము నిలువ లేదు. కాకతీయసార్వభౌమునకును గంగయసాహిణికిని నైన మహాసంగ్రామమున వీరశిఖామణియగు చాళుక్య వీరభద్రేశ్వరుఁడు వీరస్వర్గము నందెను. అంతకుముందే రుద్రమదేవీ వీరభద్రుల యనురాగవల్లి రెండు మొగ్గలు దొడిగినది. ఆ మొగ్గలే ముమ్మడమ్మయును రుయ్యాంబికయును. వీరిరువురిలో ముమ్మడమ్మ కుమారుఁడు ప్రతాపరుద్రుఁడు. అతనిని రుద్రమదేవి పెంచుకొనినది. ఈతఁడే చరిత్రప్రసిద్ధుఁడగు కాకతీయ వీరప్రతాపరుద్ర చక్రవర్తి.

అంతకంతకు గణపతిదేవచక్రవర్తికి వార్ధక్య ము ముందడుగు వేయసాగెను. దానితోఁబాటు దీర్ఘవ్యాధి వెంటఁబడినది. స్వర్గయాత్రకు సంసిద్ధుఁడై మరణశయ్యపై నున్న మహారాజోకనాఁడు మహాప్రధానియగు గోవిందామాత్యులవారినిఁ బిలిపించి యేకాంతముగా నిట్లు పలికెను :

మంత్రిశేఖరా ! తమ సాహాయ్యమున నింతవఱకు నీయాంధ్రసామ్రాజ్యము నేకచ్ఛత్రముగాఁబరిపాలింపఁగలిగితిని. నేను వృద్ధుఁడనై యీ లోకమును వీడిపోవుచున్నాను. నా యనంతరము నా ముద్దులబిడ్డయగు నీ రుద్రమదేవికి 'వీర రుద్రదేవ' నామముతోఁ బట్టాభిషేక మొనరించి మహాసామ్రాజ్యము నవిచ్ఛిన్నముగా నిలిపి ప్రజారంజకముగాఁ

పరిపాలనము సాగింపఁజేయుబాధ్యత మీ హస్తములయందు సమర్పించుచున్నాను. కాకతీయ కీర్తి లతామతల్లికలను దిగంతముల కెగఁబ్రాకింప సర్వసమర్థులగు మీ హస్తకమలములలో నీ ముద్దులపుత్రిక నునిచి నిశ్చింతముగా ప్రాణములను వీడుచున్నాను." ఇట్లు పలికి రుద్రమదేవి హస్తమును ప్రధానామాత్యులచేతిలో నుంచెను. గోవిందామాత్యులవారి నయనము లశ్రుపూరితము లయ్యెను. ఆయన తన కర్తవ్యమును నెఱవేర్పఁగలనని మహారాజునకు వాగ్దానముచేసెను. అనంతరము కొంతసేపటికి మహారాజు కన్నులు మూసికొనెను.

సార్వభౌముని మరణానంతరము కొలఁదికాలముననే తదాజ్ఞానుసారముగా గోవిందామాత్యులవారు వజ్రసింహాసనముమీఁద రుద్రమదేవికిఁ బట్టాభిషేక మొనర్చుటకై సర్వసన్నాహములు గావించెను. రాజగురువు లగు విశ్వేశ్వర శివదేవయ్యవారిని బిలిపించి శుభముహూర్తము నిర్ణయము చేయించిరి. సామంతభూపాలురు నానాభరణధనకనకవస్తు వాహనములను బహుమానములుగా సమర్పించిరి. నిర్ణీతమగు శుభలగ్నమున సమస్తప్రజామండలి సమక్షమున కాకతీయ సింహాసనమునం దాసీనురాలై మహారాజ్ఞి రుద్రమదేవి పట్టాభిషిక్తురాలయ్యెను. ఆ మహోత్సవమును కన్నులారఁ గాంచి యాంధ్రప్రజానీకము మహానందసాగరమున నోలలాడినది.

రుద్రమదేవి యాంధ్రదేశమున కేకైక మహారాజ్ఞియై నిరుపమాన శౌర్యసాహసములతో సామ్రాజ్యచక్రమును సాగింప మొదలుపెట్టెను. ఆమె చల్లని పరిపాలనమున

సంతోషము ననుభవింపనివారు లేరు. కాని రాజబంధువులగు హరిహర మురారిదేవు లిరువురకుమాత్రము రుద్రమదేవి ప్రభుత్వము కంటకమయ్యెను. మొదటినుండియుఁ బుత్త్ర సంతానములేని గణపతిదేవచక్రవర్తి తమలో నొకరికి రాజ్యము నొసఁగునని వారు కొండంత యాశతో నువ్విళ్లూరు చుండిరి. కాని వారి యాశలన్నియు నిరాశలయ్యెను. దూర దేశమున రాజప్రతినిధులుగానున్న వారిరువురు అంత్యకాల మునకు నోరుగంటిలో లేకపోయిన తమ రాజ్యార్హత కెక్కడ లోటు వాటిల్లునో యని చక్రవర్తి యవసానసమయమున నేకశిలానగరమునకుఁ జేరుకొనిరి. కాని చక్రవర్తి సంకల్ప ముతోఁబాటు భగవంతుని సంకల్పమును వారికిఁ బ్రతికూలము గనే పరిణమించెను.

విశాలాంధ్రసామ్రాజ్య సింహాసనమున నొక యబల పట్టాభిషిక్తురాలగుట గాంచినంతనే వారికి ద్వేషము మితి మీఱెను. కిరీటమును ధరించిన రుద్రమదేవిని గాంచి వారి హృదయములు మఱింత కలుషితములు కాసాగెను. దురాశా పరులగు వా రిరువురు సామంతరాజులతోఁ గలిసి కుట్రలు సలుపసాగిరి. ఒకయాఁడుదాని పరిపాలనకులోఁబడి శిరస్సులు వంచుట మనవంటి పౌరుషవంతులకు భరింపరాని యవమాన మని వారలను రెచ్చఁగొట్టిరి. ఆవశ్యకమగు పక్షమున తాము వారికి సర్వవిధముల సాయపడెదమని వాగ్దానమొనరించిరి. కాని వారి యాశాలతలు లేఁతలోనే వాడిపోయినవి. కుట్రలు బయటపడినవి.

మురారి హరిహరులు రాజద్రోహము చేయుటకై ప్రయత్నములు చేయుచున్నారని వినుటతోడనే మహామంత్రి గోవిందామాత్యులవారికి మిక్కిలి యాగ్రహము కలిగెను. ఆయన వెంటనే వారిరువురను బిలిపించి వారి ద్రోహచింతలను నిరూపించి "జాగ్రత్త" యని హెచ్చరించెను.

అది మొదలు మురారిహరిహరులకు నిద్రపట్టలేదు. రాత్రిపగలు ప్రతినిమేషమును ప్రాణాపాయభయము వారిని బాధింప మొదలిడెను. "ఈ లేనిపోని యాశలు నీకు పుట్టినవిగాని వాస్తవముగా మనకు రాజ్యాధికార మెక్కడిది? మహారాజుల వారిచ్చిన యే కొలంది పదవులతోనో తృప్తి నొందక వృథాలోచన లొనరించి లేనిపోని కష్టములను గొని తెచ్చుకొంటి" మని హరిహరుడు మురారిని దూఱ నారంభించెను. "రాజ్యమునందుఁ బౌరుషము ప్రధానము. రాజ్యాధికారము జన్మముతో నెవ్వరికిని తేరగాఁ బ్రాప్తించదు. సుక్షత్రియవంశమునఁ బుట్టిన పురుషులు పరాక్రమవంతులై దిగ్విజయ మొనరించి రాజ్యపాలన మొనరింపవలయును. లేదా వీరోచితముగ మరణింపవలయును. అంతేకాని సామాన్యసైనికులవలె నొకరిక్రింద—అందులో నాఁడుదాని క్రింద—కొలువుసేయుచు జీవన్మృతులమై తేజోవిహీనులమై బ్రతుకులీడ్చుట నా యభీష్టముగాదు. పురుషులమై జన్మించి పూఁబోఁడికి జోహారులు చేయుటకు సిగ్గుపడవలదా" యని మురారి హరిహరుని మందలించెను.

సామ్రాజ్యమందే సేనానాయకునితోఁగాని, ఏ మంత్రివరునితోఁగాని, ఏ దండనాయకునితోఁగాని రాణి కించుక వైమనస్యము కలుగునేమో యని వా రిరువురు సమయముకొఱకై వేచియుండిరి.

---

## ౪

మహారాజ్ఞి సమస్తప్రజారంజకముగా రాజ్యమును బాలించుచుండెను. సామంతనరనాథులు, ప్రజలు గణపతిదేవ చక్రవర్తియే రాజ్యమొనరించుచున్నట్లు భక్తివిశ్వాసములతో రాణిని సేవించుచుండిరి.

అయినను దక్షిణదిశయందున్న వైరిరాజులవలన నాయా ప్రాంతములందు సామ్రాజ్యశాంతికిఁ గొంత భంగము వాటిల్లినది. చోళులకును గాకతీయులకును యాగర్భశత్రుత్వము. గణపతిదేవుని మరణవార్త చోళచక్రవర్తియగు కులోత్తుంగచోళుఁడు వినినవెంటనే యపారమగు సేనావాహినితోఁ గాకతీయసామ్రాజ్యములోనికిఁ జొచ్చుకొని రాఁదొడఁగెను.

తాత్కాలికముగా కొప్పెరుంజింగడు గణపతిదేవ చక్రవర్తి సామంతుఁ డయ్యెనేకాని యతఁ డమిత పరాక్రమశాలి. ఆనాఁటి వీరసైన్యములలోఁ బల్లవసేనను బ్రతిఘటింపఁ గలుగునది మరియొకటి లేదనియే చెప్పవచ్చును. అట్టి

మహాసైన్యముతోఁ గొప్పిరుంజింగఁడు తిరుగఁబాటొనరించెను. కాంచీపుర ప్రతినిధియగు గండగోపాలుఁడును సామ్రాజ్యమునకు వ్యతిరేకముగ విద్రోహమునకుఁ దలపడి కుట్రదారులతోఁ జేతులుకలిపెను.

మహారాజ్ఞి రుద్రమదేవి దక్షిణదిశయందేర్పడిన యీ యలజడి కేమాత్రమును భయపడలేదు. ప్రాణములను ధారవోసియైన నోరుగల్లు సామ్రాజ్యమును రక్షించుటకు బద్ధకంకణులైన దండనాయకులెందఱో యామె కండగా నిలిచిరి. వారిలో రేచర్ల రుద్రుఁడును, కాయస్థులైన త్రిపురాంతకుఁడును, అంబదేవుఁడును ముఖ్యులు. వీరు ముప్వురును జగదేకవీరులు. అనేక మహాసంగ్రామరంగములలో నందెవేసిన చేతులు. రేచర్ల రుద్రుఁడు కులోత్తుంగుని యపారసేనానీకములను జెల్లాచెదరుగావించి పాఱఁద్రోలెను. వీరాధివీరులగు త్రిపురాంతకుఁడును, నతని తమ్ముఁడగు నంబదేవుఁడును గొప్పిరుంజింగనిఁ దఱిమివైచి గండగోపాలుని గర్వమణఁచి విద్రోహకారులను బందీలుగాఁ గొనివచ్చి రుద్రమదేవి పాదసాన్నిధ్యమునఁ బడవైచిరి.

పై విధముగా దేశమునందల్లరులు బయలుదేరిన కాలముననే మురారి హరిహరులు కొలఁదిసైన్యములను మాత్రము తీసికొని ఓరుగల్లు పట్టణమును విడిచిపోయిరి. దయామయ హృదయమగు రుద్రమదేవి మురారిహరిహరుల దురాలోచనములు దెలిసినను వారి నుచితరీతుల గౌరవించుచునే వచ్చెను. అట్లయినను నామె యౌదార్యము కృతఘ్నులగు వారియెడ నేమాత్రమును ప్రయోజనకారి గాలేదు.

క్రమక్రమముగ వారిరువురు కుతంత్రములను సాగించుచునే యుండిరి. కొలఁది సైన్యములతో బయలుదేరి యా విద్రోహులిరువురు యాదవరాజ్యమును జేరుకొనిరి. యాదవ రాజును నోరుగంటిపై దండెత్తిరావలసినదని ప్రార్థించిరి. రుద్రమదేవిని పదభ్రష్టురాలినిగావించి తమ్మా సింహాసనముపై నభిషేకించినచో బ్రతికినంతకాలము సామంతులమై యాద వులకుఁ గప్పములు గట్టుచుండెదమని యాసవెట్టిరి. తమ సామ్రాజ్య మన్యాయముగా స్త్రీహస్తగతమైనదనియు గణపతి దేవుఁడు పుత్త్రికయందలి మమకారముచే యుక్తాయుక్తము లెఱుంగక దేశమునకు మహాపకారము గావించినాఁడనియు, ఇది తమకేకాక దేశమునందలి వీరవరేణ్యుల కందఱకు భరింపరాని యవమానకరమైన విషయమనియు, దీని కంతకు గోవిందామాత్యుని దుర్నీతియే మూలకారణమనియు పరిపరి విధముల యాదవరాజుతో మొఱవెట్టుకొనిరి. గణపతిదేవ చక్రవర్తి తన యనంతరము తమకే సామ్రాజ్యము నిమ్మని చెప్పినను మహామంత్రి తన ప్రాభవమున కెట్టి భంగము వాటిల్లునో యను భయముచే రాజుమాట త్రోసిపుచ్చి యసమర్థురాలగు రుద్రమను పేరుకుమాత్రము సింహాసనము పైఁ గూర్చుండఁబెట్టి వాస్తవమునకుఁ దానే రాజై చక్రము ద్రిప్పుచున్నాఁడని యేవేవో లేనిపోని నిందలు చెప్పి యాదవరాజు సహాయ మర్థించిరి.

ఆ కాలమున యాదవరాజ్యమును మహాదేవరాజు పరిపాలించుచుండెను. ఆయన రాజధాని దేవగిరి ఈతనికి మొదటినుండియు నాంధ్రసామ్రాజ్యమును విచ్ఛిన్న మొనరించి

దక్షిణాపథమున కంతటికి నేకచ్ఛత్రాధిపత్యము వహింప వలయునను కోరిక మిక్కుటముగా నుండెను. దానికిఁ దగినట్లు సామ్రాజ్యమునందలి గుట్టుమట్టు లెఱిఁగిన రాజబంధువులు మిత్రులైనారు. ఇంకఁ గావలసిన దేమున్నది? మహాదేవుఁడు పరమానందముతో నేకశిలానగరముపై దండెత్తుటకుఁ గాకతీయసామ్రాజ్యమును భగ్నమొనరించుటకును మురారి హరిహరులకు వాగ్దాన మొనరించెను. బ్రహ్మాండమగు సైన్యమును సంసిద్ధపఱచుకొని సమయమునకై నిరీక్షించు చుండెను.

మురారి హరిహరులు ముఖ్యపట్టణమును వదలినది మొదలు కొంతకాలమువఱకు రుద్రమదేవి వారేమి పన్నాగ ములు పన్నుచున్నారో యని విచారించినది. గూఢచారు లను బంపించి వెదకించినది. ఈ దుర్మార్గులు సామ్రాజ్యమున హఠాత్తుగా నేమూలనుండి యెట్టి యుపద్రవమును దెచ్చిపెట్టు దురో యని యామె మానసమున సందేహ మంకురించినది. ఆఱేండ్లు గడచిపోయినవిగాని మురారిహరిహరుల విషయమై యెట్టి సమాచారమును రాణికి చారుల ముఖమునఁ దెలియ రాలేదు. అవమానమును భరింపలేక హతాశులై యెందేని ప్రాణత్యాగము గావించుకొనియుందురని యామె తలపోసి యింక వారి జాడలను దెలిసికొను ప్రయత్నమునుండి విరమించు కొనినది.

క్రమక్రమముగా సామ్రాజ్యమునఁ బ్రబలిన కల్లోల ములు శాంతించినవి. వినోద విహారములకును, కవితా గోష్ఠులకును, కళాప్రదర్శనములకును మహారాజ్ఞి కొంకెంత

విశ్రాంతి లభించినది. శ్రీ వీరరుద్రమహారాజ్ఞి యేఁటేఁట నెన్నెన్నియో పండిత సత్కారములు గావించినది. ఎంద జెందఱో కవులను గౌరవించినది. బీదసాదలకు విరివిగా దానధర్మములు గావించినది. బ్రాహ్మణుల కగ్రహారము లొసంగినది. వేలకొలఁది చెరువులు త్రవ్వించినది. ఉద్యాన వనములు వేయించినది. దేవాలయములను నిర్మింపఁజేసినది. అనాథజనులకు జీవనముఁ గల్పించినది. వేయేల! నామె తన యుదారస్వభావముచే గణపతిదేవ చక్రవర్తికంటె నధిక మగు యశస్సు గడించినది.

---

౫

ప్రశాంత సమయములందు సైతము రుద్రమదేవి దుర్గ రక్షణమునందును, సైన్యసమీకరణమునందును, రాజ్యాభి వృద్ధియందును నశ్రద్ధ వహింపలేదు. పల్లవనాయకునకు నగరరక్షకపట్టము గట్టినది. ఏకశిలానగరదుర్గము ననేక విధముల సంస్కరించినది.

అంతకుపూర్వము గణపతిదేవచక్రవర్తి దుర్గము చుట్టును గట్టించిన ఱాతిగోడకు లోపలిభాగమునందు మెట్లు లేవు. అట్టి సోపాన నిర్మాణ మొనరించి శత్రురాజులు నగరమును ముట్టడించినప్పుడు తనసైనికులు అనాయాసముగా

కోట గోడలెక్కుట కవకాశము గల్పించినది. దుర్గ మధ్య భాగమునం దెన్నియో నూతనాయుధాగారములను నిర్మించినది. మదపుటేనుంగుపై నెక్కి సంగ్రామ సమయములందు సైనికులను స్వయముగా నడిపించుటకు వీలగునంత విశాలముగా దుర్గముచుట్టును మఱియొక మట్టిప్రాకారమును గట్టించినది. శత్రువులకు సర్వవిధముల దుర్గము దుర్భేద్యముగ నుండుటకై వెలుపటి ప్రాకారముచుట్టును లోతైన యగడ్తను త్రవ్వించినది.

ఆమె సేనానాయకులు ఓరుగంటి దుర్గప్రాకారము నెనిమిది గవనులుగను పదునాఱు దిడ్లుగను విభజించిరి. దుర్గ సంరక్షణముకొఱకై కొమ్మ కిరువురు, బురుజు కేబదిమంది, దిడ్డికి నూర్గురు, గవను కయిదువందలమంది, రక్షకభటులను సమాయత్తపఱచిరి.

రుద్రమదేవి యద్వితీయ శివభక్తురాలు. తన తండ్రి యగు గణపతిదేవ సార్వభౌముడు జీవించియుండగనే యామె గోళకీశైవ మఠాధిపతియగు విశ్వేశ్వర శివదేశికాచార్యులవారికి వెలగపూండిగ్రామమును దాన మొసగించినది. విశ్వేశ్వర శివదేశికులు స్త్రీలకొఱకై యానాటి యావత్ప్రపంచ మెఱుగని ప్రసూతిశాలను నిర్మించుటకు రుద్రమదేవి ప్రోత్సాహమే కారణము. ఆమె యాగ్రామమున నిర్మింపబడిన విశ్వేశ్వరస్వామివారి యాలయమునందు ప్రతిదినము నష్టాదశవర్ణములవారికిని నన్నదానముగావించుట కేర్పాటుచేసినది. స్వామివారి కష్టవిధకైంకర్యముల కనువు చూపినది.

సంవత్సరమున కొకటిరెండు పర్యాయములైనను ఆప్తబంధువులతో వెలగపూండిగ్రామమునకు విచ్చేసి స్వామి వారిని సందర్శించి కానుక లర్పించుకొనుట యామె కాచారము. చాలకాలమునుండి యీ యాచారముప్రకారము స్వామిసందర్శనమునకై వచ్చుచుండెను. కాని పట్టాభిషేకానంతరము రాజ్యమునం దేర్పడిన యలజడులకారణమునం గొంతకాలమును, స్వపరిపాలనానిర్వహణ కార్యభారము వలన మఱికొంతకాలమును మహారాజ్ఞి కట్టి యవకాశము లభించినది గాదు.

ప్రస్తుతము రుద్రమదేవి కొంచెము విశ్రాంతి లభించినది గదా యని దుర్గరక్షణమునకై కొంతసైన్యమును నియమించి కొంత సైన్యమును వెంటఁగొని సబంధుమిత్రముగా స్వామివారి సందర్శనమునకై బయలుదేరివచ్చినది. శివదేశికాచార్యులవారి యాహ్వానమును, విశ్వేశ్వరస్వామివారి మహోత్సవములును రుద్రమదేవి వెలగపూండికిఁ బయనమగుటకు ముఖ్యకారణములు. రాణిగారి రాక నెఱింగిన యక్కడి భక్తవరేణ్యులు స్వామివారి మహోత్సవములు కైంకర్యములు నూతనోత్సాహముతో జరిపించుచుండిరి. సామాన్యగ్రామమగు వెలగపూండి యీ యుత్సవ సంరంభములతో నొక మహాపట్టణమువలెఁ బెరిఁగిపోయినది. మహారాణికి తా నా యుత్సవములలోఁ బాల్గొనునప్పుడు ఏకశిలానగరములోని శ్రీ స్వయంభూదేవస్వామివారి మహోత్సవములలో నున్నట్లే యుండెను.

ఈ విధముగా రుద్రమదేవి వెలగపూఁడికి వచ్చి విశ్వేశ్వరస్వామివారికి మహాన్యాసపూర్వకముగ నభిషేకములు గావించినది. సహస్రనామార్చనములు జరిపించినది. లక్ష పత్రిపూజలు యథావిధిగా నెఱవేర్చినది. కానుకలు సమర్పించినది. బీదసాదలకు బహుమూల్య వస్త్రాభరణములు దానము గావించినది. అసంఖ్యాకులగు జనుల కన్నదానము చేసినది.

వినోదమునకై యొక కాఁపుపడుచువలె మారువేషమును ధరించి సంతలోఁ బ్రవేశించినది. సమస్తవస్తువులను బేరమాడినది. వీథిభాగవతములను దర్శించినది. భరతనాట్యములను పరికించినది. కోడిపందెములను, పొట్టేలు పోట్లాటలను చూచి నవ్వుకొనినది. అమాయికులగు జానపదుల సంభాషణము లాలకించి కొంతతడవు వినోదించినది. నాటకరంగములయందుఁ బ్రదర్శింపఁబడుచున్న తన విజయగాథలను గాంచి సంతోషభరితమానసురాలైనది. ఆ యానందములో, ఆ సంతోషములో, ఆ యుత్సాహములో విశాలాంధ్రసామ్రాజ్యమును తన బాహువులపై నిడికొని మోయుచున్న విషయమే మఱచిపోయినది.

ఈ విధముగా సామాన్య ప్రజానీకముతోఁ గలసి మెలసి, తిరిగి, సంభాషించి తానొక సాధారణ వ్యక్తివలె వారి కష్టసుఖములలో, ఆనందోత్సాహములలో పాలు పంచుకొని మహారాణి మరలివచ్చునప్పటికి చాల ప్రొద్దు పోయినది.

శివదేశికాచార్యులు మహానందముతో మహారాజ్ఞి కెదురువచ్చి భగవత్ ప్రసాదముగా నొసంగిన ఫలాహారములను రుద్రమదేవి సగౌరవముగా గ్రహించి కన్నుల కద్దుకొని భుజించినది. అనంతర మామె కొంచెము సేపు విశ్రమింపఁదలంచి శైవమఠ మధ్యభాగమునకు వచ్చి యించుక మేను వాల్చినది. శివదేశికాచార్యులవారు తన జటాజూటమును సవరించుకొనుచు ద్వారపురోభాగమున నిటునటు పచారు చేయుచుండిరి.

ఆకస్మికముగా నాలయప్రాంతమున గుఱ్ఱపుడెక్కల చప్పుడు వినిపించినది. మరు నిమేషముననందే యొక రాజభటుఁడు నురుగులు గ్రక్కుచు దేవాలయము ముందు గుఱ్ఱమును దిగి "శివదేవదేశికాచార్యులవా రెక్కడ" యని యాతురతతో ప్రశ్నించెను. అతనికి జనము దారి చూపించెను. ఆ భటుఁడు శివదేవయ్యగారిని చూచి సాష్టాంగ దండ ప్రణామము గావించి గోవిందామాత్యులవారి స్వహస్తముతో లిఖింపఁబడిన యొక లేఖను చేతి కందించెను. శివదేవయ్య ఆ లేఖ నందుకొని వడివడిగా విప్పి రెండు మూఁడు పంక్తులు చదివెనో లేదో వెంటనే నిదురించుచున్న రుద్రమదేవి నుద్దేశించి "తల్లీ! నీ యనుమాన మీనాఁటికి నిజమైనది. మురారి హరిహరదేవులు సామ్రాజ్యమునకు మహాప్రళయము గొనివచ్చినారు" అని పలుకుచు లేఖను మహారాణి కరకమలములలో నుంచెను.

రుద్రమదేవి యాతురతతో నా లేఖ నందుకొని వడి వడిగా నిట్లు చదువుకొనినది—

"స్వస్తిశ్రీ స్వయంభూదేవదివ్యశ్రీపాద పద్మారాధక, పరబలసాధక, ప్రత్యక్షప్రమథగణ హితావతార, శ్రీమన్మహామండలేశ్వర కాకతీయ రుద్రదేవ మహారాజులుంగారికి— హరిహర మురారిదేవు లపార సైన్యసమేతులై వచ్చి మన దుర్గమును ముట్టడించినారు. వారలకు యాదవరాజు సహాయమున్నట్లు తెలియుచున్నది. తాము తత్క్షణము పయనమై రాజధాని నగరమునకు దయచేయవలయును. వందనములు.

పాపపద్మారాధకుఁడు—గోవిందామాత్యుఁడు."

ఒక్కమాటుగా మహారాణి శరీరమంతయుఁ బుల కించినది. కనుబొమలు ముడివడినవి. వదనమండల మరుణ వర్ణము దాల్చినది. వామభుజ మదరినది. సేనానాయకునిఁ బిలిచి వెంటనే ప్రయాణసన్నాహ మొనరింపుమని రుద్రమదేవి యాజ్ఞాపించినది. ఆ విశాలలోచనములనుండి ప్రళయ కాలాగ్నిజ్వాలలు ప్రజ్వలింపసాగినవి. శివదేవదేశికాచార్యులవారికే యాసమయమున మహారాజ్ఞి ముఖమండలమున దృష్టి నిలుపుటకు భయము కలిగినది.

## ౬

యాదవసైన్య సహాయముతో ముందుగా బయలుదేరి మురారిహరిహరులు ఏకశిలాపురమునఁ బ్రవేశించిరి. అసావధానులైయున్న పట్టణప్రజలు మొట్టమొదట శత్రుసైన్యములను గాంచి కొంత భయమందిరి. కాని మెల్లఁగా ధైర్యము తెచ్చుకొని పోరాడసాగిరి. ఓరుగల్లు దుర్గరక్షణమునం దప్రమత్తుఁడైయున్న మహామంత్రి గోవిందామాత్యుల వారు శత్రుసైన్యములు దుర్గపరిసరములకు రాకుండ నడ్డగించుచుండెను. మహారాణి దుర్గములో లేదని తెలియుటచే మఱింత యుత్సాహముతో నెట్లులైనఁ గోట స్వాధీనము చేసికొనవలెనని పట్టుదలతో మురారిహరిహరుల సైన్యములు ప్రాణములకుఁ దెగించి సమరము సాగించుచుండెను. అయ్యపోతినాయఁడు మొదలగు దుర్గరక్షకులు రాణిగారులేని సమయమున కాకతీయసామ్రాజ్య గౌరవమును సర్వవిధములఁ గాపాడుటకై నడుముగట్టి విరోధివరూధినుల నెదుర్కొనుచుండిరి. ఇరువైపుల సైన్యములకు పోరు ఘోరమయ్యెను.

ఇంతలో రుద్రమదేవి సేనావాహినీ సమేతముగ మహావేగముతో వచ్చి వెనుకనుండి మురారిహరిహరుల కాల్బలముమీఁద దాడి చేసినది. యాదవసైన్యములు కాకతీయసేనల వీరవిజృంభణమున కాఁగలేక చెల్లాచెదరై పోసాగెను. అడకత్తెరలోఁబడిన వక్కవలె మురారిహరిహరుల సైన్యము దిక్కుతోఁచక దిగ్భ్రమ నందుచుండెను.

కాని మురారిహరిహరుల ధైర్యము సన్నగిలలేదు. కొలఁది కాల మట్లే పోరాడుచుండినచో యాదవరాజగు మహాదేవుఁడు మహత్తర సేనాసమూహముతోఁ దమకు సాయము రాఁ గలఁడుగదా యని వా రాశపడుచుండిరి. ఇంతలో మహాదేవ రాజు సైన్యముతో రానేవచ్చెను. శత్రువుల బల మధిక మైనది. రుద్రమదేవి యద్వితీయ పరాక్రమముతో మహా సముద్రమునుబోలిన యాదవసైన్యమును మందరపర్వతము వలెఁ గలఁచివేయుచుండెను. పగతుర యసంఖ్య సేనా సమూహముమధ్య వీరవిహార మొనరించుచున్న యా నారీ శిరోమణి దుర్గప్రాకారమునుండి చూచువారలకు "మహిషా సురమర్దని" వలెఁ గానుపించుచుండెను. ఆమె నడుమనడుమ కులదేవతయగు కాకతిమహాశక్తిని, ఇష్టదైవతమగు స్వయం భూదేవస్వామిని స్మరించుచు కరాగ్రమున భయంకర కర వాలమును ధరించి శత్రుసైనికులను చించి చెండాడసాగినది.

రుద్రమదేవీసైన్యములకు సహాయముగా గోవిందా మాత్యులవారు కోటలోనుండి కొంతసైన్యమును బంపెను. ఎవరో యొక యజ్ఞాతయువకుఁడా సైన్యముల కధిపతియై నడిపించుకొని వచ్చుచుండెను. అతఁడు మహారాణిసైన్య ములను చేరకముందే యాదవసైన్య మాతనిపైఁ దలపడినది. ఆ యువకుఁడు నిరుపమానవిక్రమముతో ప్రతిపక్షసేనల చీల్చి చెండాడి పురోగమించు చుండెను. రణము క్షణమున కొక విధముగా పరిణమింపఁజొచ్చినది. తప్పక జయలక్ష్మి తమ్మే వరింపఁగలదను విశ్వాసముతో యాదవసైన్యము లసువులపై

నాశలువీడి ముందుకుఁ జొచ్చుకొని వచ్చుచుండిరి. అజ్ఞాత వీరుఁడు వీరాభిమన్యునివలె విజృంభించెను. శత్రువుల చమూ సమూహములు వానిముందు నిలువలేక పలాయనము చిత్త గించినవి. ఇదియంతయు దూరమునుండి గాంచుచున్న మహా దేవుఁడు సైన్యముల నన్నింటిని సమీకరించుకొని యా వీరునిపైఁ దలపడెను. ఎట్లయినను కోటలోని సైన్యమును రుద్రమదేవి సైన్యములతోఁ గలియనీయరాదని మురారిహరి హరులు ప్రయత్నించుచుండిరి.

క్రొత్తగాఁ గోటలోనిసైన్యములను నడిపించుకొని వచ్చిన యజ్ఞాతవీరుఁడు శత్రుసైన్యమధ్యమునఁ జిక్కెను. నలుప్రక్కలు యాదవసైన్యములు చుట్టుకొనినవి. ఇంతలోఁ గాకతీయసైన్యములయందు జయజయధ్వనులు మిన్నుముట్టి నవి. అన్నామాత్యుఁడు పెద్దసైన్యముతో నజ్ఞాతవీరునకు సహాయముగా వచ్చెను.

అన్నామాత్యుఁడు కళింగదేశమునుండి సైన్యసమే తుఁడై యరుదెంచినవార్త దుర్గములోనివారికిఁ దెలిసినది. వారి యానందోత్సాహముల కంతులేదు. కాకతీయసైనికులు ద్విగుణీకృతోత్సాహముతో విజృంభింపసాగిరి. అయ్యపోతి నాయఁడు గజసైన్యమును నడిపించుకొని కోటలోనుండి వెలుపలకు వచ్చి విరోధిచమూవాహినిపైఁ బడెను. కాకతీయ గజములు యాదవసైన్యములపైఁబడి త్రొక్కి చిందఱవందఱ చేసినవి. యాదవవీరులు దిక్కుతోఁచక పంచబంగాళమై పరువెత్తసాగిరి. మహారాణి మహాదేవరాజుపై దూఁకి యాతనిని

బందిగావించినది. మురారిహరిహరులు పలాయన మంత్రమును పఠింపఁజూచిరి. కాని అన్నామాత్యుఁడు హరిహరుని వెంటఁ బడెను. అజ్ఞాతవీరుఁడు మురారిని వెన్నాడెను.

విద్రోహు లిరువురును బంధితులైరి. మురారిహరి హరులను నడిపించుకొని యజ్ఞాతవీరుఁడును, నన్నామాత్యుఁడును మహారాణిని సమీపించిరి. కాకతీయ విజయదుందుభి స్వనములతో దిక్కులు పిక్కటిల్లినవి.

వీరరాజ్ఞీమణి రుద్రమదేవి యేకశిలానగరమున బ్రహ్మాండముగా విజయోత్సవములు జరిపించినది. వీరశిరోరత్నములగు కాకతీయసైనికులకు సముచిత బహూకృతులొసంగినది. యుద్ధద్రవ్యముగా యాదవరాజునుండి గ్రహించిన ధనమును ప్రజలకుఁ దోసిళ్లకొలఁది పంచిపెట్టినది. మురారిహరిహరులను భ్రష్టులఁగావించి బందీగృహముల పాలు చేసినది.

నిన్న మహాసంగ్రామరంగమున వీరవిహార మొనరించిన యా యజ్ఞాతవీరుఁ డెవ్వరో యని యందఱకు సందేహము పొడమెను. ఆ వీరుఁ డెవ్వరో కాదు, మహారాణి రెండవ కుమార్తెయగు వీరనారీశిరోమణి రుయ్యాంబికయే! ఆమె బహుకాలమునుండియు యోధాగ్రేసరుఁడగు నన్నామాత్యునిఁ బ్రేమించినదని మహారాణి యెఱుఁగును. ఆ విజయోత్సవ సంతోషసందర్భములో రుద్రమదేవి రుయ్యాంబికకును అన్నామాత్యునకును పాణిగ్రహణ మహోత్సవము జయప్రదముగా జరిపించినది.

రుద్రమదేవి యాదర్శ వీరనారీశిరోమణి. ఆమె వీర చరిత్రము భారతదేశచరిత్రలో బంగారు పంక్తులతో వ్రాయఁదగినది. ఆంధ్రగౌరవమును, ఆంధ్రసామ్రాజ్యగౌరవమును, ఆంధ్ర మహిళాగౌరవమును రుద్రమదేవి విశ్వవిఖ్యాతములు గావించినది. ఇట్టి మహా ప్రకాశవంతమగు వీరరత్నమును గాంచుటచే, మన భారతమాత నిజముగా రత్నగర్భ.

# పోతన మహాకవి

## ౧

అది నయనానందసంధాయకమగు నొక సుందర క్షేత్రము. సస్యశ్యామలమగు నా పొలము భూదేవి ధరించిన యాకుపచ్చనివలువవలె వెలుఁగొందుచుండెను. అక్కడక్కడ చక్కఁగా విరియఁ బూచియున్న జనుప చెట్లు బంగారుపూవులవలెఁ బ్రకాశించుచుండెను. ముగ్గినదోసపండ్ల సువాసన మార్గమునఁ బోవు బాటసారులకు నోరూరఁ జేయుచుండెను. కంటినిండఁ గానవచ్చుచున్న నూఁచబియ్యపుఁ గంకులు గాలికి నటునిటు గదలాడుచు వచ్చిపోవు పథికులను నాహ్వానించుచుండెను.

ఆ పొలము నడుమ పెద్ద మంచె యొకటిగలదు. దానిపైఁ బదిపదునాలుగేండ్ల ప్రాయముగల బాలుఁడొకఁడు నిలుచుండి హస్తమున నొడిసెలను ధరించి పిట్టలను గొట్టుచుండెను. నడుమ నడుమ నేవియో కూనరాగములు దీయుచు మంచె మీఁదనుండి గుబుక్కున నేలమీఁదికి దుముకుచు కొన్ని మంటిపెడ్డల నొడినిండ నేఱుకొని మరల మంచె నెక్కుచుండెను.

దాదాపు రెండుజాములు గావచ్చినది. సూర్యభగవానుఁడు తనప్రచండకిరణములతో నాకాశమధ్యమున దేదీప్యమానముగఁ దేజరిల్లుచుండెను. వృక్షచ్ఛాయలు హ్రస్వము

లయ్యెను. దూరమునందలి కొండ లాయెండలో వెండి పూతలు పూసికొన్నవో యన్నట్లు వెలుఁగొందుచుండెను. మట్టమధ్యాహ్నమగుటచేఁ బత్తులు కొన్ని తలలువంచుకొని పొలములందలి వేఁపచెట్లపైఁ గునికిపాట్లు పడుచుండెను. ఎండ చిటచిట లాడించుచుండెను.

ఆ సమయమున నా పంటపొలములకుఁ బ్రక్కగానున్న మార్గమున నొక యోగిపుంగవుఁడును గొందఱు శిష్యులును వచ్చుచుండిరి. వారి వదనములవైపు చూచిన చాలదూరము నుండి నడచివచ్చుటచే మిక్కిలి బడలియున్నారని స్ఫురించు చుండెను. అందొకఁడు మెల్లఁగా మంచెవద్ద కరుదెంచి "బాబూ! ఇచ్చట సమీపములో నెందైన పానీయము గలదా? దాహముచే నాలుక లెండిపోవుచున్నవి. ఆ కనిపించు గ్రామమునకుఁ బోవలయును. నడువ లేకున్నాము" అని బాలకుని ప్రశ్నించెను.

బాలకుఁడు చివాలున మంచెమీఁదనుండి నేలకుఱికి "రండు రండు, మా పొలములో మధుర జలసంపూర్ణమైన కొలనున్నది. కావలసిన యూఁచబియ్యమును దిని కడుపునిండ నీరుత్రావి పోవుదురుగాని" యని వారలనందఱ నాహ్వానించెను. ఆ యోగిపుంగవుఁడు శిష్యసమేతుఁడై పొలములోఁ బ్రవేశించెను. బాలుఁడును వారలనందఱ వెంటఁబెట్టుకొని క్షేత్రమధ్యమున నున్న జలాశయము చెంతకుఁ గొనిపోయెను. అందఱును గుంటయొద్దున దట్టమైన వేఁపచెట్టు నీడలో చల్లఁగాఁ గూర్చుండిరి. బాలుఁడు తనదగ్గఱనున్న మృణ్మయ

పాత్రతో జలాశయములోని మధురజలమును గొనితెచ్చి యా బైరాగుల దాహమును బాపెను. కొందఱు మెల్లఁగా కొలనులోనికి దిగి స్వేదబిందు సమ్మిశ్రితమగు తమ ముఖములను గడుగుకొనుచుండిరి.

బాలుఁడు పరుగు పరుగునం బోయి పండిన దోస పండ్లను నొడినిండఁ గోసికొనివచ్చి తనయొద్దనున్న కొడవలితో ముక్కలుముక్కలుగా కోసి వారందఱకుఁ బంచిపెట్టెను. అనంతరము గుమ్మటములవంటి జొన్నకంకులను గొనివచ్చి క్షణములో నూఁచబియ్యమునుకొట్టి యతిథులను సంతృప్తులఁ గావించెను. దోసిళ్లకొలఁది తియ్యని యూఁచబియ్యమును మెక్కుచు నా యోగిసముదాయము బాలుని యతిథి సత్కారమును బహుముఖములఁ బ్రశంసించిరి.

యోగీంద్రుఁడు మిక్కిలి ప్రసన్నుఁడై యా యర్భకుని యాననము నాలోకించి "నాయనా! మీ దేయూరు? నీ పేరేమి? జననీజనకు లెవ్వరు? నీ సత్కారమునకుఁ జాల సంతసించితిని; నీ కేదైన నుపకారము చేయవలయునని బుద్ధిపొడముచున్నది. నీ ముఖలక్షణములు గాంచిన నీవు గొప్పవాఁడవు కాఁగలవని తోఁచుచున్నది." అని ప్రేమ పూర్వకముగా పలికెను.

బాలుఁడు వినయవినమిత శిరస్కుఁడై హస్తములు జోడించి "స్వామీ! ఆ కనుపించుచున్న ఏకశిలయే మా గ్రామము. నా పేరు పోతన్న యందురు. మాతండ్రి కేసన

మంత్రి; తల్లి లక్కమాంబ" యనియెను. యోగీంద్రుఁడు కొంచె మాలోచించి, "మంచిది, నీ కేమి కావలయునో కోరు కొను" మనియెను. పోతన నవ్వుచు "స్వామీ! నాకు భగవంతుని యనుగ్రహము కావలయును." అని పలికెను. యోగిపుంగవుఁడు బాలకుని సదుద్దేశమునకు మిక్కిలి సంత సించుచు "కుమారా! నీవు చదువుకొంటివా" అని మరల ప్రశ్నించెను. పోతన వినయముతో "అయ్యా! మా నాన్న గారే నా కక్షరాభ్యాసము గావించి విద్యాబోధము సలిపి నారు. కాళిదాసత్రయము పూర్తియైనది. ఆంధ్రభారతము గూడ పఠించితిని." అని పలికెను. పోతన మాటలకు యోగి లలాముఁ డమందానందకందళిత హృదయుఁడై "కవిత్వము కూడ చెప్పెదవా?" యనెను. "చిత్తము! తమ దయవలన నిప్పుడిప్పుడే గీతపద్యముల వ్రాయుచున్నా" నని పోతన సమాధాన మిచ్చెను. యోగి కుతూహలముతో "బాబూ! ఏదీ యొక్క పద్యమును చదువుము విందు" మని పలుకు చుండఁగనే పోతన తన మృదుమధుర కంఠమెత్తి ఇట్లు చదివెను:

తే. చేతులారంగ శివుని బూజింపఁడేని
నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబులోనుగాఁ దలఁపఁడేని
కలుగ నేటికిఁ దల్లుల కడుపుచేటు.

పద్యమును విని పట్టరాని సంతోషముతో నా యోగీంద్రుఁడు పోతనను కౌఁగిలించుకొని "నాయనా! నీవు

మహాకవివి కాఁగలవోయి! నీ సంకల్పము సత్యమగు మానవ జీవితమును బ్రకటించుచున్న" దని బాలుని సమీపమునకుఁ బిలిచి యొక మహామంత్రము నుపదేశించి "నీవు దీనిని స్మరించుకొనుచుండుము. నీకుఁ బరమేశ్వరానుగ్రహము గలుగఁగల" దని వచించెను. పోతనయుఁ జేతులుమోడ్చి "ఇదంతయును తమ యవ్యాజానురాగము" అని యోగికి నమస్కరించెను. యోగీంద్రుఁడు తన పవిత్రహస్తముతోఁ బోతన శీర్షమును స్పృశించుచు "చిరంజీవి వగుదువుగాక" యని యాశీర్వదించెను.

---

౨

పోతనకు యుక్తవయస్సు సంప్రాప్తించెను. దూర దూరములనుండి సంబంధములు వచ్చుచుండెను. తల్లియగు లక్కమాంబయును దండ్రియగు కేసనమంత్రియును యోగ్యమగు సంబంధమును వెదకి కుమారునకు వివాహముసేయ సంకల్పించిరి. కాని మొదటినుండియు పోతనకు నైహిక విషయములయం దంతగా నాదరబుద్ధి లేకుండెను. తల్లిదండ్రులు పరిణయముమగూర్చి ప్రస్తావించినప్పుడెల్ల నేదియో వంక చెప్పి తప్పించుకొనుచుండెడివాఁడు. ఆయన కాలమంతయును వ్యవసాయము చేయుటయందే గడచిపోవుచుండెను. ప్రొద్దున నే యెద్దులను దోలుకొని పొలము పోవుటయన్న నాయన

కెక్కుడగు లేని సంతోషము. అక్కడ కొంతసేపు పొలమదున్ని వృషభము లలపుదీర్చుకొనుటకై యరకనాపి తాను పొలము గట్టుపైఁ గూర్చుండి ఆకాశమునఁ బరువెత్తు పక్షులను, ఆకాశమంటుచున్న పర్వతములను, సస్యశ్యామలములయిన క్షేత్రములను ప్రకృతిమాత ప్రణయాంకమున చిఱునవ్వులు చిందించుచున్న గడ్డిపూలను జూచి యానందించుచు భగవానుని మహిమలకు నక్కజపడుచుండెను. ఈ విధముగా పోతన పరాధీనమనస్కుఁడై యుండుట గాంచి జననీజనకులు కుమారుని స్వభావమునకు మిక్కిలి చింతించిరి. వివాహము చేసినఁగాని పోతన బాగుపడఁడని నిశ్చయించిరి. తగిన సంబంధమును విచారించి ఒకానొక శుభముహూర్తమునందు తమ నందనునకుఁ గల్యాణము గావించిరి.

పోతనభార్యపేరు లక్ష్మి. ఆమె నిజముగ పోతన పాలిటికి భాగ్యలక్ష్మియే. పతికిఁ దలలోని నాల్కయై, యత్తమామలమాట కడుగుదాఁటక యా సాధ్వీశిరోమణి తన సుగుణపుంజములచే నెల్లర మెప్పువడయుచుఁ గాఁపురము చేయుచుండెను.

లక్ష్మి భాగ్యవంతులయింటి బిడ్డ. కవిసార్వభౌముఁ డని విశ్వవిఖ్యాతి గడించిన శ్రీనాథునికి గారాబు సోదరి. బాల్యమాదిగ నెండకన్నెఱుఁగక పువ్వులలోఁ బెరిఁగినది. నేఁడు బీదవారింటి కోడలయినది. అయినను నా యొప్పుల కుప్ప యొక్కింతయుఁ జింత యనుమాట యెఱుంగక యత్త వారింటి కలంకారమై, యిరుగుపొరుగు వెలందుల కాదర్శమై,

శాంతికి నిలయమై, పతిభక్తికిఁ బట్టుకొమ్మయై యలరారుచుండెను. రామచిలుకలవలె నన్యోన్యమైత్రితోఁ మెలఁగుచున్న కొడుకును గోడలిని జూచి వృద్ధదంపతులు మిక్కిలి యానందించిరి.

కొంతకాలమునకు లక్ష్మమ్మపోతనామాత్యుల కొక్క పుత్త్రుఁడును బుత్త్రికయు జన్మించిరి. కుమారునకు మల్లన యనియును, గుమార్తెకు శారద యనియును నామకరణము గావించిరి. దాంపత్యతపఃఫలములగు నా బిడ్డల నిర్వురఁ గనుంగొని గారాబమునఁ బెంచుచుఁ బోతనామాత్యుఁడు పరమేశ్వర పాదారవింద ధ్యానపారవశ్యముతోఁ గాలక్షేపము సేయుచుండెను.

పోతన కుటుంబమువారు మొదటినుండియు భాగ్యవంతులు గారు. వారల దొక సామాన్యకుటుంబము. చాల దినములనుండియు వ్యవసాయమే వారలకు జీవనాధారమై యుండెను. పోతనామాత్యుఁడును పరంపరాగతమగు కులవృత్తిని విడువలేదు. తన తాతముత్తాతలవలెనే తన తండ్రి కేసనామాత్యునివలెనే తానుగూడ కర్షకుఁడై నాఁగలిఁబట్టి వ్యవసాయమును జేసెను. భూమినిదున్ని సస్యశ్యామలము గావించెను. భూమాత చలువవలనను, శ్రీరామచంద్రమూర్తి కరుణాకటాక్షమువలనను పోతన యన్నపానీయములకుఁ గఱవులేక యున్నంతలోనే తాను దిని యతిథిసత్కారములు గావించుచుండెను. ఆఁకలిగొనివచ్చిన యభ్యాగతుఁ డెవ్వఁడును నా మహాత్ముని యింటికివచ్చి నిరాశతోఁ దిరిగిపోలేదు.

బిచ్చమునకువచ్చిన బీదసాదలెవ్వరును పోతన యింటిముందు నుండి వట్టిచేతులతో మరలిపోలేదు. ఆయన కలిగినంతలో దానశీలుఁడు. భగవంతుఁ డిచ్చినంతలో పరోపకార పరాయణుఁడు.

పోతనామాత్యుఁడు కవియును గర్షకుఁడునేకాక మహా భక్తుఁడు. చిన్నతనమున పొలములోఁ గావలిగాచునప్పుడు చిదానందయోగీంద్రుఁ డుపదేశించిన మహామంత్రము నాతఁడు మఱవలేదు. నిలుచుండినను, కూర్చుండినను, నిద్రించు చుండినను, భోజనముచేయుచుండినను, నీరు ద్రావుచుండినను పోతనామాత్యుని చేతము నిరంతర పరమేశ్వర పదకమల సంస్మరణాసక్తమై యుండెను.

పోతన మహాకవి యనియు, పరమభక్తాగ్రగణ్యుఁ డనియు, పవిత్రమూర్తియనియు నాయనకీర్తి దేశమంతయు వ్యాపించెను. వివిధప్రాంతములనుండి యసంఖ్యాకులగు శిష్యులు వచ్చి యాయనయొద్ద విద్యాభ్యాసము గావించు చుండిరి. అనన్యసామాన్య మగు నాయన నిరాడంబర జీవితమును గాంచి జనులు పెక్కువిధముల నా ధన్య మూర్ధన్యునిఁ గొనియాడుచుండిరి. బావగా రగు శ్రీనాథ మహాకవియును నప్పుడప్పుడు వచ్చి సోదరుని మేనల్లుని మేన కోడలినిఁ జూచిపోవుచుండెను. వచ్చినప్పుడెల్ల బావగారి సాత్త్వికస్వభావమునకు, నిరాడంబర వేషమునకు, నిరంతర వ్యవసాయదీక్షకుఁ బోతనామాత్యుని వేళాకోళములు సేయు చుండెను.

శ్రీనాథుఁడు సామాన్యుఁడు కాఁడు. కవిసార్వభౌముఁడు. మహారాజుల మన్ననలు పొందినవాఁడు. కంచుఢక్కలు పగులఁగొట్టి కనకాభిషేకము లందినవాఁడు. రాజాస్థానములలో కవితాసుధారసమును జిందించి రత్నహారములను, బంగారు పతకములను బహుమానము లందినవాఁడు. పుట్టు భోగి. అదృష్టవంతుఁడు. అట్టివానికిఁ దన ప్రియసోదరి యొక సామాన్య గృహస్థునకు భార్యయై మెడలో నల్లపూసల లోనికిఁ దెల్లపూస లేక కాఁపురము సేయుచుండుట నచ్చలేదు. పోతన కవితాశక్తి యతఁ డెఱుఁగును. ఎట్లయిన బావమఱఁది చేత చక్కని గ్రంథములు వ్రాయించి రాజాస్థానములకు బలవంతముగా నైనఁ గొనిపోయి పోతనను ధనవంతునిఁ గావింపవలెనని యాతఁ డాలోచించుచుండెను. కాని పోతనామాత్యుని స్వభావ మందులకు సంపూర్ణముగ వ్యతిరేక మయ్యెను.

శ్రీనాథునకు ధారుణీపతులనిన నెంత గౌరవమో పోతనామాత్యునకు వారనిన నంత చిరాకు. శ్రీనాథునకు రాజభోగములనిన నెంత కుతూహలమో పోతనకు వానిపై నంత యసహనము. ఆయనకు రాజాశ్రయమన్న నెంత యిష్టమో ఈయనకు నంత కష్టము. ఒకరి కాడంబరముపై నాసక్తి; మఱొకరికి నిరాడంబరతపై రక్తి. ఒకరికి భోగ భాగ్యములపై బుద్ధి; వేఱొకరికి త్యాగమయజీవనముపై బుద్ధి. బావమఱఁదు లిరువురకును భావములందును స్వభావములందును ఐక్యము సంభవించలేదు.

## 3

అది యొకనాఁటి ప్రాతఃకాలము. అప్పుడే సూర్యోదయమయ్యెను. సూర్యభగవానుని సువర్ణకిరణములు భూమాత ప్రేమమయ హృదయముపై ననురాగకాంతులు విరఁజిమ్ముచుండెను. నవయౌవనములోనున్న మల్లన పిల్లరైతువలె మేడిఁబట్టుకొని పొలములో అరక దున్నుచుండెను. తండ్రి పోతనామాత్యుఁడు కొంచెముదూరములో చేనిగట్టుపై నాసీనుఁడై కుమారుని వ్యవసాయసామర్థ్యమును ఱెప్ప వాల్పక గమనించుచుండెను.

అరక నాలుగైదుసారు లటునిటు తిరిగినది. కొంచెము కొంచెము ప్రొద్దెక్క-సాగినది. ఇంతలో దూరమునుండి పల్లకీ మ్రోఁత వినిపించినది. మల్లన చటుక్కున తలయెత్తి చూచెను. వట్టి పల్లకిగాదు; పట్టుకుచ్చుల పల్లకి.

ముందు నలువురు వెనుక నలువురు బోయలు మోయుచుండిరి. ఆ యందలమునందు శ్రీనాథకవి సార్వభౌముఁడాసీనుఁడై యుండెను. పల్లకి చేనికి సమీపముగా నున్న మార్గమునఁ బోవుచుండెను. మల్లన వృషభముల నిలిపి మామగారి మహైశ్వర్యమును ఱెప్పవేయక చూచుచు నిలఁబడెను.

పట్టుకుచ్చుల పల్లకిలోఁ బ్రయాణమై పోవుచున్న పండిత కవిశేఖరుఁడు గట్టుపైఁ గూర్చుండియున్న కర్షకవరుని గాంచినాఁడు. శ్రీనాథుని యరుణాధరములపై చిఱునగవు

చిందులాడెను. తన మహత్త్వమును బావగారికిఁ జూపింప వలయునని కుతూహల పడినాఁడు. పల్లకి మోయుచున్న ముందువైపు బోయలను తొలఁగుఁడని పలికినాఁడు. బోయలు తప్పుకొనిరి. కాని యా యందలము యథాప్రకారముగానే ముందుకు సాగిపోవుచుండెను.

ఈ యద్భుతదృశ్యమును జూచునప్పటికి మల్లన మహానందపరవశుఁ డయ్యెను. అతఁడు తండ్రియగు పోతనామాత్యుని బిలిచి "నాన్నగారూ! అటు చూడుఁడు మామయ్య గొప్పఁదనము! ఆహా! ఏమి ప్రభావము! ఎంత మంత్రశక్తి! పల్లకి ముందువైపు మోఁతగాండ్రు లేకయే ముందుకు పోవుచున్నది" అని పలికెను. బాలకుని పలుకులు విని భక్తశిఖామణియగు పోతన మందహాసవదనారవిందుఁడై "నాయనా! ఎందుల కంత వింతపడియెదవు? నీవును నీయెద్దు నొకదానిని విప్పివేయు" మనెను. మల్లన యాశ్చర్యముతో కుడివైపుకాఁడికిఁ గట్టియున్న వృషభమును దొలఁగించెను. అయినను అరక అవ్యాహతముగ ముందుకు నడచిపోవుచుండెను. ఇదియంతయుఁ జూచి శ్రీనాథమహాకవి రెండవవైపు బోయలనుసైతము పల్లకి విడిచిపెట్టుఁడని యాజ్ఞాపించెను. బోయలు దండెవిడిచి దూరముగాఁ బోయిరి. కవిసార్వభౌముని బ్రాహ్మీదత్త వరప్రభావమువలన పల్లకి పూర్వమువలెనే పోవుచుండెను. ఇది చూచినవెంటనే మల్లన మరల తండ్రిముఖమువైపు గనుఁగొనెను. పోతనార్యుఁడు "మల్లన్నా! మనముమాత్ర మూరకుందుమా యేమి! రెండవ

వైపుగి త్తనుగూడ విప్పు"మనెను. మల్లన యట్లే గావించెను. అరక యథాప్రకారముగా సాగిపోవుచుండెను.

శ్రీనాథుఁ డిదియంతయుఁ గాంచి పోతనామాత్యుని శక్తి కచ్చెరువందెను. ఆయనకూడఁ దనవలెనే మహిమ సంపన్నుఁడని గ్రహించెను. ఇఁక తన యాట లాయనయెుుందర సాగవని తలంచెను. వెంటనే పల్లకి దిగి పోతనామాత్యుని సమీపమునకుఁ జనుదెంచెను. పోతనామాత్యుఁడును కుమారునితో మఱఁదిగారి కెదురువచ్చెను. శ్రీనాథుఁడు పోతనను సపలాసముగఁ జూచుచు నొకింత మందస్మితము గావించి "హాలికులకు క్షేమమా" అనెను. వెంటనే పోతనామాత్యుఁడు బావగారి కిట్లు సమాధాన మిచ్చెను.

ఉ॥ బాల రసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్
కూళలకిచ్చి యప్పడుపుఁ గూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైన నేమి గహనాంతర సీమల కందమూల కౌ
ద్దాలికులైన నేమి నిజదారసుతోదర పోషణార్థమై.

పోతన యెత్తిపొడుపు వాక్యమునకు శ్రీనాథుఁడు లజ్జావనతవదనుఁ డయ్యెను. ఆయన యేమియు మాటాడలేక "బావా! హాస్యమున కనిన నంత కోపమువచ్చినదా? నీకేమి మగవాఁడవు! కష్టపడి వ్యవసాయముచేయుదువు కాని మా చెల్లెలిని, బిడ్డలను జూచిన నా కడుపు చెఱువగుచున్నది. నీకీ కర్మ మేమి? కమ్మనికవిత్వము వ్రాయఁగలవే! రసను లొలుకు మహాకావ్యములు రచింపఁగలవే! ఏదైన నొక్క

గ్రంథము వ్రాసి యే రాజునకైన గృతియిచ్చితివేని నిన్ను బంగారుపూలతో పూజసేయరా! నీ యిండ్లు, వాకిండ్లు మణిమయభూషణములతో నిండిపోవా! బావా! మహాను భావుఁడవు! మహామహిమ సంపన్నుఁడవు! మడి దున్న నేలనయ్యా?" యని సవినయముగ హెచ్చరించెను.

అందులకుఁ బోతన "బావగారూ! ఆ భోగభాగ్యము లన్నియు మీరే యనుభవింపుఁడు. నన్నేమి చేయుమందువు? నా కావ్యములను నరాంకితము చేయుట యనిన నా కిష్టము లేదు. భగవంతుఁ డిచ్చినంతవఱకు కలియో గంజియో త్రావి కాలక్షేపము చేయుటయే కాని కడుపు కక్కుర్తికై రాజుల నాశ్రయించుటకు నా హృదయము సమ్మతింప" దని ఖండితముగఁ బలికెను. శ్రీనాథమహాకవి పోతనామాత్యుని పట్టుదలకు వెఱఁగుపడి చేయునదిలేక మఱల పల్లకినెక్కి వెడలిపోయెను.

ఇంతలో పోతన పుత్రిక శారద అన్నకు అన్నమును గొనివచ్చెను. మల్లన యెద్దులనువిడిచి మేఁత వేసి చెల్లెలితో సల్లాపించుచు నన్నముమూటగై కొని గుంటగట్టునకుఁ బోయెను. పోతనామాత్యుఁడు తన ముద్దుబిడ్డలను, తన క్షేత్రలక్ష్మిని ఒక్కమాటు సందర్శించి రెండుచేతులు పైకెత్తి "ప్రభూ! ఈ మాత్రము చాలును. నా మానసమున ఆశా తరంగములు లేపకుము" అని భగవంతునకు భక్తిపూర్వక ముగా ప్రణామము గావించెను.

౪

ఆనాఁడు కార్తికశుద్ధపూర్ణిమ. చంద్రగ్రహణము. ఆ సోమోపరాగపుణ్యపర్వమున పవిత్ర గౌతమీనదీజలములలో స్నానము గావించి భవబంధవిముక్తు లగుటకై జనులు తండోపతండములుగ వచ్చుచుండిరి. గోదావరీ తీరమునం దెచ్చట చూచినను తీర్థప్రజలే! ఎచ్చట గాంచినను వేదమంత్రధ్వనులే! ఎచ్చట తిలకించినను పుణ్యాంగనా పూజోపహారములే!

అదిగో! దూరముగా ఆ పండువెన్నెలలో—ఆ వెండియిసుకలో—ఆ యానందపారవశ్యములో – కించిదున్మీలితలోచనుఁడై మహేశ్వర ధ్యానముగావించుచున్న మన పోతనామాత్యుఁడు! ఆహా! ఏమి యా ముఖవర్చస్సు! ఏమి యా దివ్యతేజస్సు! ఏమి యా మనోనిశ్చలత! ఏమి యా భక్తితన్మయత!

అవిగో! ఆ పెదవులనుండి యేవియో మధుర వాక్కులు వినవచ్చుచున్నవి.

సీ. మెఱుఁగు చెంగటనున్న మేఘమ్ముకైవడి
నువిద చెంగట నుండ నొప్పువాఁడు
చంద్రమండల సుధాసారమ్ము పోలిక
ముఖమునఁ జిఱునవ్వు మొలచువాఁడు

వల్లీయుత తమాల వసుమతీజముభంగి
బలు విల్లు మూపునఁ బరఁగువాఁడు
నీల నగాగ్ర సన్నిహిత భానుని భంగి
ఘనకిరీటము దలఁ గలుగువాఁడు
పుండరీక యుగముఁబోలు కన్నులవాఁడు
వెడఁద యురము వాఁడు విపులభద్ర
మూర్తియైన రాజముఖ్యుఁ డొక్కరుఁడు నా
కన్నుఁగవకు నెదురఁ గానఁబడియె.

ఓహో! మహాకవికి శ్రీరామచంద్రమూర్తి సాక్షాత్కారమైనది. ప్రభు వేదియో భక్తవర్యున కాజ్ఞయిచ్చినట్లున్నాఁడు. అదిగో! మహాకవినోట మరల నేదియో మధుర కవిత వినిపించుచున్నది.

క॥ పలికెడిది భాగవతమఁట!
పలికించెడు వాఁడు రామభద్రుండఁట! నేఁ
బలికిన భవహరమగునఁట!
పలికెద వేఱొండు గాథ పలుకఁగ నేలా.

ఆహా! ఎంత సంతోషవార్త. శ్రీరామభద్రుఁడు భాగవతము వ్రాయుమని యాజ్ఞయిచ్చినాఁడఁట మహాకవికి. ఆంధ్రభూమి ధన్యమైనది. తెలుఁగువారు కృతార్థులైనారు. అదిగో! మహాకవి ప్రభువునాజ్ఞ శిరసావహించి బంధుమిత్రులతో బయలుదేరి నిజపురమున కరుగుచున్నాఁడు.

మహాకవీ! నమస్సులు!
భక్తశిఖామణీ! జోహారులు!



మహాకవి మహాభాగవతరచన కుపక్రమించినాఁడు. ఆయన ముద్దులపుత్రిక శారద గంటము చేఁబూని తండ్రి నుడివినదే తడవుగా తాటియాకులపై ముత్యములవంటి యక్షరమాలికలను ముద్దుముద్దుగా దిద్దితీర్చుచున్నది. కవి వరేణ్యుని జిహ్వాంచలమునుండి యమృతలహరి ప్రవహించు చున్నది. భాగవతకల్పవృక్షము లలితస్కంధమై శుకా లాపాభిరామమై మంజులతామోహనమై సువర్ణసుమనస్సుజ్ఞే యమై నానాఁటికిఁ బెంపొందుచున్నది.

మహాకవి యపారభక్త్యావేశముతో, ననుపమాన ప్రతిభావిశేషముతోఁ గావ్యరచన సాగించుచున్నాఁడు. సహజపాండిత్యుని కవితాకన్యక స్వభావసిద్ధమగు శయ్యా సౌభాగ్యముతో ననల్పకల్పనా సముల్లాసముతో విశ్వ మోహనముగా విజయనర్తనము సల్పినది.

భాగవతము పరిపూర్తినందినది. ఆంధ్రుల నోముల పంట యగు భాగవతమహాపురాణము పరిపూర్ణమైనది. అనంతకరుణాసముద్రుఁడగు శ్రీరామభద్రుఁ డనుగ్రహించి పలికించినాఁడు; భక్తశిరోమణి పలికినాఁడు.

తెలుఁగువారి పురాకృతసుకృతఫలము భాగవతము సర్వాంగసుందరముగ సంపూర్ణమైనది. తెలుఁగుతల్లి దివ్య దీపులు దిగంతములఁ దేజరిల్లినవి. ఆంధ్రమహాజనుల చిరకాల

వాంఛితము నేఁటికి సువర్ణస్వరూప మందుకొనినది. కవి రాజహంస మానందపరవశమై సంతోషసరసిలో నోలలాడినది.

మహాకవి శ్రీరామచంద్రునకుఁ గరములుమోడ్చి వినయవినమితశిరస్కుఁడై యిట్లు ప్రార్థించినాఁడు:—

క॥ నీ పాదకమల సేవయు
నీ పాదార్చకుల తోడి నెయ్యమును నితాం
తాపార భూతదయయును
దాపసమందార! నాకు దయసేయఁగదే!

---

## ౬

ఒకానొకదినము పోతనామాత్యుని గృహప్రాంగణమున నొక పట్టుకుచ్చుల పల్లకియుఁ గొన్ని శకటములును వచ్చి యాఁగినవి. శ్రీనాథమహాకవి యసంఖ్యాకశిష్యవర్గముతోఁ గుటుంబసమేతుఁడై బావమఱఁదిని జూచిపోవుట కరుదెంచినాఁడు. పోతన బావగారి కెదురువచ్చి యర్ఘ్యపాద్యము లందించినాఁడు. పరస్పర కుశలప్రశ్నములతో బావమఱఁదు లిరువురు కొంతసేపు కాలము గడపినారు.

శ్రీనాథుని సోదరియగు లక్ష్మి తలుపుచాటుగ నిలఁబడి యన్నగారిని బలుకరించినది. శారద పరుగుపరుగున వచ్చి మామయ్య తెచ్చిన మంచిమంచి బహూకృతులను లోనికిఁ

గొనిపోయినది. పంచవర్షప్రాయుఁడగు మాంమయ్య కుమారుని ముద్దులాడినది. పోతనామాత్యుఁడు మెల్లఁగా లేచి గృహాభ్యంతరమున కరిగినాఁడు. శూన్యదృక్కులతో మొగము చిన్నపుచ్చుకొని వచ్చుచున్న యర్ధాంగినిఁ గాంచినాఁడు.

ఇంట నొక్కవస్తువుకూడ లేదు. కుండలో బియ్యము నిండుకొన్నవి. భోజనమునకు వందమంది యతిథులు వచ్చి యున్నారు. కవిశిరోమణికిఁ గాలుసేతు లాడలేదు. ఇంటిలోని వస్తుసామగ్రియంతయు నీవఱకే యమ్ముడువోయినది. ఆ పూట కాహార మెట్టులా యని యాలోచించుచున్న నిఱుపేద కవి యింతమంది కతిథిసత్కారము చేయుటెట్లు? పోతనామాత్యుఁ డితికర్తవ్యతామూఢుఁడై నిమీలితనేత్రములతోఁ బరమేశ్వరు నిట్లు ప్రార్థించినాఁడు: "రామభద్రా! దయాసముద్రా! ఈ కష్టసముద్రమునుండి నన్నెట్లు గట్టెక్కింతువో? ఇప్పట్టున నా పరువు నెట్టుల నిలఁబెట్టెదవో! నీ యార్తావనబిరుదము నేవిధముగ సార్థక మొనర్చుకొందువో?"

ఇంతలో మల్లన వీథిలోనుండి యింటిలోనికి వచ్చెను. ఆతనివెంట నిరువురు యువకులు రెండు పెద్దపెద్ద గంపలనిండ సమస్తవస్తుసామగ్రి మోసికొనివచ్చి లోపలఁబెట్టి సెలవు దీసికొని వెడలిపోయిరి.

పోతనామాత్యుఁ డాశ్చర్యముతో నాత్మనందను నవలోకించి "ఈ సామగ్రియంతయు నిచ్చటి కెటుల వచ్చినది?

ఇచ్చినవా రెవ్వరు? తెచ్చినవా రెవ్వరు?" అని ప్రశ్నించెను. మల్లన్న మందహాసముసేయుచు "ఏమో! నాన్నగారూ! ఎవ్వరో యిరువురు నూతనపురుషులు నేను పొలమునుండి వచ్చుచుండఁగా మధ్యేమార్గమున నెదురుపడి బమ్మెరవారి యిల్లెక్కడ యని ప్రశ్నించినారు. నేను నా వెంటరండని మనయింటికిఁ దీసికొనివచ్చితిని. త్రోవలో వారి యుదంతమునుగూర్చి నే నెన్నివిధముల నొక్కియడిగినను ప్రత్యుత్తరమీయక 'మా యజమానుఁ డీ వస్తువులను కవిగారియింటికిఁ గొనిపొమ్మన్నారు' అనిమాత్రము పలికి చిఱునవ్వు నవ్వి యూరకుండిరి" అని చెప్పెను.

భక్తశిరోమణి ప్రహర్షపులకితశరీరుఁడై తల పంకించి "మల్లన్నా! నీ వెంతటి యదృష్టవంతుఁడవోయీ! భక్తరక్షణ పరతంత్రుఁడగు పరమపురుషుని పరిచయభాగ్యము నీకు లభించినది. వారే—ఆ తేజోమూర్తులే—రామలక్ష్మణులు. నాయనా! ఆ కరుణామయులు నిరంతరము మనలను గంటికి రెప్పవలెఁ గాపాడుచునే యున్నారు" అని పలికెను.

ఆ విచిత్రసంఘటనమునకు లక్ష్మీముఖము వికసించినది. ఆమె శారదసాయముతో క్షణములో వంట సిద్ధము చేసినది.

శ్రీనాథమహాకవి శిష్యసమూహముతో స్నానసంధ్యాద్యనుష్ఠానములు నిర్వర్తించుకొనినాఁడు. శిష్యులందఱు బంతులుబంతులుగా నాసీనులైనారు. చకచక వడ్డన

జరిగిపోయినది. సంతోషసంభాషణములతో, సరససల్లాప ములతో భోజనములు పూర్తియైనవి. స్వాదిష్ఠములగు భక్ష్యభోజ్యపానీయములతో నతిథులందఱు సంతృప్తులైనారు.

భోజనానంతరము మహాకవు లిరువురు తాంబూల చర్వణ మొనర్చుచు లోకాభిరామాయణములతోఁ గొంత కాలముఁ బుచ్చినారు.

"బావగారూ! భాగవతమును బూర్తిచేసితిరఁట. మీ కవితామృతమును గఱువుదీఱఁ గ్రోలుట కాంధ్రావని యెంతయు నాతురపడుచున్నది" అని కవిసార్వభౌముఁ డనెను.

పోతన మందహాసముతో "నంతయు శ్రీరామభద్రుని కరుణాకటాక్షము. మనము నిమిత్తమాత్రులము" అని పలికెను.

"భాగవతశ్రవణాసక్తితోడనే నేఁడిందఱము మీ గృహమున కరుదెంచినాము. బావగారు మా వాంఛితము దీర్పవలయును" అని శ్రీనాథమహాకవి వాక్రుచ్చెను. పోతన "శారదా! భాగవతమును దీసికొనిరా తల్లీ!" అని ముద్దుల పుత్త్రికను బిలిచెను. శారద లేఁతలేఁతచేతులతో భాగవత మును గొనివచ్చి యాత్మజనకుని హస్తములలో నుంచెను.

మధురమనోహర కంఠస్వరముతో మహాకవి భాగవత పారాయణమున కుపక్రమించెను. కవిసార్వభౌముఁ

డనన్యాయత్తమైన చిత్తముతో భాగవత సుధారసమును గ్రోలి గ్రోలి యానందపరవశుఁ డగుచుండెను. ఆ మహా గ్రంథమునందలి మందార మకరంద మాధుర్యములకు శ్రీనాథుని మనోమధుపము ప్రముగ్ధ మగుచుండెను. ఆ కావ్యమందలి నిర్మలమందాకినీ వీచికలలో శ్రోతల మానస మరాళము లుయ్యాలలూఁగుచుండెను. హృద్యములగు పద్యములతో, రమణీయములగు నంత్యప్రాసములతో, మనోరంజకములగు వర్ణనములతో, సరసములగు సంభాషణలతో విరాజిల్లుచున్న పోతన భాగవతము శ్రీనాథమహాకవికి శ్రవణానందమును సమకూర్చెను.

పోతనమహాకవి తనగ్రంథమునందలి రసవద్ఘట్టములను ప్రత్యేకముగ బావగారికి వినిపించెను. ప్రహ్లాదచరిత్రము, గజేంద్రమోక్షణము, వామనచరిత్రము, శ్రీరామచరిత్రము, శ్రీకృష్ణావతారఘట్టము, బాలగోపాలలీలలు, కాళియమర్దనము, గోవర్ధనోద్ధరణము, రాసక్రీడ, భ్రమరగీతలు, రుక్మిణీకల్యాణఘట్టము, సత్యభామానరకాసుర సంగ్రామము మొదలుగాఁగల కథాభాగములను విని మరల మరల చదివించుకొని శిష్యబృందమును, శ్రీనాథుఁడును కావ్యరసామృతపానములో మైమఱచిపోయిరి.

ఇట్లు కొంతతడవు భాగవతము వినిపించి పోతనామాత్యుఁడు శ్రీనాథునిఁజూచి "బావా! భాగవత మెట్లున్నది?" అని ప్రశ్నించెను. కవిసార్వభౌముఁడు గద్గదకంఠముతో నిట్లుపన్యసించెను.

మహాకవీ! నిజముగా మహాకవిశబ్దము నీకే చెల్లును. శ్రోతలను సొమ్మఱపించి యే లోకమునకో గొనిపోఁగల యైంద్రజాలికశక్తి నీ కవిత్వమునకే కలదు. నీ భాగవతము తెలుఁగువారి నోములపంట. ప్రతి పద్యము రసార్ద్రమై ముద్దులు మూటగట్టుచున్నది. నీ భావావేశము, రస తన్మయత, శయ్యాసౌభాగ్యము వేనోళ్లఁ గొనియాడఁదగి యున్నవి బావా!

ఉ॥ ముద్దులుగాఱ భాగవతముఁ రచియించుచు పంచదారలో
అద్దితివేమొ గంటము మహాకవిశేఖర! మధ్యమధ్య అ
ట్లద్దక వట్టిగంటమున-అట్టిటు గీచిన తాటియాకులో
పద్దెములందు-ఆ మధురభావము లెచ్చటనుండి వచ్చురా!

నీవు గంటముఁగొని కావ్యము వ్రాయునపుడు తీయనిరసములు నీ లేఖినిలోఁ దమంతఁ బొంగిపొరలెనేమో! నీవలె భక్తిరస ప్రవాహముల కేతమెత్తినమహాకవి తెలుఁగుగడ్డపై లేఁడు. గోరువెచ్చని పాలమీఁగడలను, విచ్చీవిచ్చని గులాబిమొగ్గలను మచ్చరించు నీ మధురమంజుల సుకుమారశైలి నీవెచ్చట నేర్చుకొంటివయ్యా! నీ చిత్తమే కాదు. నీ చేయిసైత మెంత సుతిమెత్తనిదయ్యా! ఎప్పుడు వ్రాసితివయ్యా యింతగ్రంథము! వ్యాసునిగ్రంథముల నెంద అనువాదము చేయలేదు? ఏ[illegible] యీ క్రొత్తసొగసులు ఆ యందఱకు నలవడలేదే! మూలమునలేని యీ యందచందములు మఱెవ్వరి గంటములందు నింతగా రూపొందలేదే! వరాలకు నెత్తుకెత్తుగా నా చక్కఁ

దనాల పద్యములు వ్రాయుటకు నీవే తగుదువయ్యా! ఎన్ని పోకడలు పోయితివి! ఎంత చక్కఁగ నూహించితివి! ఎంత రసవత్తరముగఁ జెప్పితివి, మహాకవీ!

"సీ॥ భీష్మునిపైకి కుప్పించి లంఘించు గో
పాలకృష్ణుని కుండలాలకాంతి
కరిరాజు మొఱవెట్ట పరువెత్తు కఱివేల్పు
ముడివీడి మూపుపైఁ బడిన జుట్టు
సమరమ్ము గావించు సత్యకన్నులనుండి
వెడలు ప్రేమక్రోధ వీక్షణములు
కొసరి చద్దులుమెక్కు గొల్లపిల్లల వ్రేళ్ల
సందు మాఁగాయ పచ్చడిపసందు
ఎటుల కనుగొంటివయ్యా! నీ కెవరు చెప్పి
రయ్యా! ఏరాత్రి కలగంటివయ్యా; రంగు
కుంచెతో దిద్దితీర్చి చిత్రించినావు!
సహజపాండితి కిది నిదర్శనమటయ్యా!!!"

"ఉ॥ ఎండినమ్రోడులే కిసలయించెనో! ఏకశిలాపురమ్ములో
బండలు పుల్కరించెనో! అపారముదమ్మున తెల్గుతల్లికిన్
గుండెలు పొంగిపోయి కనుఁగొల్కులు నిండెనో! పచ్చిపైరులే
పండెనో! జాలువాఱిన భవత్కవితామృత భక్తిధారలన్!"

సస్యశ్యామలములగు సుందరక్షేత్రములలో విహరించుచు సర్వాంగసుందరమగు నీ భాగవతమహాగ్రంథమును వెలయించి

నావు. నన్నయతిక్కనాదులు భాగవతమును తెలిఁగింపక విడిచినది నీకోసమే కాఁబోలు. ఈ మహాకార్యముచే నీవు ధన్యుఁడవైతివి. తెలుఁగుతల్లి ధన్యురాలైనది.

కవిసార్వభౌముఁ డీవిధముగా తన్ను, తన కవిత్వమును ప్రశంసించుచుండ మహాభక్తశిరోమణియగు పోతనామాత్యుఁడు వినమ్రవదనముతో "బావా! మనదేమున్నది! మనము నిమిత్తమాత్రులము. అంతయు శ్రీరామభద్రుని కరుణాకటాక్షమే! అని చిఱునవ్వుతోఁ జేతులు మోడ్చినాఁడు.

# ౭

సాయంకాలమైనది. బావమఱఁదులిరువురు కూర్చుండి ఫలాహారము చేయుచుండిరి. శారద వలదన్న కొలఁదియు మామగారి పళ్లెరములో లడ్డులు, గారెలు క్రుమ్మరించుచుండెను. "అమ్మో! నేను తినలేను. ఇప్పటికే నా కడుపు నిండిపోయినది." అని శ్రీనాథుఁ డెంత బతిమాలినను శారద చెవినిబెట్టక మామగారి పళ్లెములో పిండివంటలు కొసరికొసరి వడ్డించుచుండెను.

పోతన "ఏమండీ! బావగారూ! మీరు భాగవతమంతయు నచ్చటచ్చట వింటిరికదా! అన్నియును బాగున్నవనే యంటిరి కాని లోపములను బ్రకటింపరైతిరి! దయచేసి

గ్రంథములో మీకుఁ దోఁచినదోషము లేవేనియున్న మొగ
మోటము వీడి తెలియఁజేయవలెనని ప్రార్థన." అని
పలికెను.

శ్రీనాథుఁడు గారెలువిఱుచుచు "బావగారూ! మీ
కవిత్వమున లోపములుగూడ నుండునా? ఒకవేళ నెచ్చట
నైన నొండురెండు నెరసులున్న నవి సంపూర్ణపూర్ణిమా
చంద్రునిలోని మచ్చవలె లెక్కలోనికి వచ్చినవికావు." అని
తలవంచి తనపని కుపక్రమించెను.

ఆ మాటలువిని పోతనార్యుఁడు "బావగారు చెప్పుటకు
సందేహించుచున్నారు. భాగవతమున నేవియో యసమంజస
భావములు వారి భావమునకు గోచరించినట్లున్నది."
అనెను.

శ్రీనాథుఁడు:—ఒక్క ప్రదేశము లో మాత్రమే నన్నొక
సందేహము బాధించుచున్నది.

పోతన:—ఏ ఘట్టమున?

శ్రీనాథుఁడు:—అష్టమస్కంధమునందలి గజేంద్ర
మోక్షణ ఘట్టమున—

అని పకపకనవ్వెను. పోతనమహాకవి విస్మయ
విస్ఫారితనేత్రములతో "కవిసార్వభౌముల కసమంజసముగాఁ
దోఁచిన సందర్భమేదియో" అని ప్రశ్నార్థకముగ నాయన
వంక చూచెను.

శ్రీనాథుఁడు "మఱేమియు లేదు. భయంకరమకర దంష్ట్రావళిఁజిక్కి ప్రార్థించుచున్న గజేంద్రునిఁ గాపాడుటకు శ్రీమహావిష్ణువు బయలుదేఱినాఁడుగదా! దుష్టశిక్షణమునకై బయలుదేఱిన శ్రీమన్నారాయణుఁడు సిరికిఁజెప్పకయే-శంఖ చక్రములను ధరింపకయే-పరివారమును పిలువనంపకయే-గరుత్మంతు నధిష్ఠింపకయే — కాలినడకతో — చేతులూఁపు కొనుచు-పోయినట్లు వ్రాసినారు. మాధవుఁడు మకరమును శిక్షించుటకై పోయెను. కాని నిరాయుధుఁడై గజేంద్రుని ముందు గంతులు వేయుటకుఁ బోలేదుగదా! ఇచ్చట నౌచితీ భంగము వాటిల్లినదేమో! కనుక నారాయణుఁడు శంఖ చక్రములు ధరించి, నందకఖడ్గమును జేతఁబట్టి, ఖగేంద్రు నధిష్ఠించి, గజరాజును గాపాడుటకై పోయెనని చెప్పినచో రసవంతముగా నుండునని నా యభిప్రాయము" అని పలికెను.

శ్రీనాథుని ఫలాహార మింకను పూర్తి కాలేదు. ఆయన మాటలధోరణిలోఁ బోతనకంటె వెనుకఁబడెను. పోతన "మంచిది బావగారూ!" అనిమాత్రము పలికి గ్రంథమును గొనివచ్చుటకుఁగాఁబోలు లోనికిఁ బోయెను.

ఇచ్చట శ్రీనాథుఁడు తన కార్యక్రమములో నిమగ్నుఁడై యుండెను. శారద కొసరికొసరి వడ్డించుచునే యుండెను. ఇంతలో దొడ్డియందలి బావిలో గభీలుమను శబ్దము వినవచ్చెను. "మామగారూ! మామగారూ! మీ పిల్లవాఁడు బావిలోఁ బడినాఁడు." అను మల్లన్నకంఠస్వరము వినిపించెను.

ఆ కేక వినుటతోడనే శ్రీనాథుఁడు చివాలున పీటపై నుంచి లేచెను. "అయ్యో! అయ్యో!" అని గుండెలు బాఁదుకొనుచు దొడ్డిలోనికిఁ బరుగులెత్తెను. మల్లన తత్తర పాటుతో బావిలోనికిఁ జూచుచుండెను. శ్రీనాథుని భార్య లక్ష్మి, శారద, అందఱును బావియొద్దకుఁ బరుగెత్తుకొని వచ్చిరి. శ్రీనాథుఁడు "అయ్యో! బాబూ! నా బంగారుతండ్రీ! నా వరాలమూటా! నా రత్నాలరాశీ!" అని విలపించుచు నున్మత్తునివలె బావిచుట్టు గంతులు వేయసాగెను.

ఇంతలో బావిప్రక్క కాఁకరపాదుచాటునఁ గూర్చుండి యున్న పిల్లవాఁడు పకపక నవ్వెను. బాలునిఁ జూచుసరికి శ్రీనాథుని ప్రాణములు కుదుటపడినవి. "ఏమిరా! మల్లన్నా! దొంగమాటలు పలికితివి." అని గద్దించి పిల్లవానిని ముద్దాడ సాగెను.

మల్లన్న "మామా! నాకేమి తెలియును. నీ కొడుకు గుండ్రాయి బావిలోపడవైచి చెట్లపాదుచాటున నక్కినాఁడు కాఁబోలు" అని నవ్వసాగెను. ఇంతలోఁ బోతనా మాత్యుఁడువచ్చి "ఏమండీ! బావగారూ! బాలుఁడు బావిలోఁ బడెనని విన్నంతనే పరువెత్తుకొని వచ్చితిరి. పరికరములు తెచ్చుట మఱచితిరి. బావిలోఁ బడినవానిని పైకిఁదీయు టకుఁ ద్రాళ్లు, నిచ్చెనలేకుండ రిక్తహస్తములతో వచ్చి గంతులు వేసితిరి. ఇదేమంత సమంజసముగా లేదే!" అనెను.

బావగారి పరిహాసము శ్రీనాథుని కర్థముకాలేదు. ఆయన ప్రశ్నార్థకముగఁ బోతనామాత్యుని ముఖమువైపు చూచుచు "అవును. పరుగెత్తుకొనివచ్చినమాట వాస్తవమే. కన్నబిడ్డ ప్రాణాపాయస్థితిలోనుండగా నాలస్యముగ నాడుచుఁ బాడుచు రమ్మందువా! త్రాళ్లు, నిచ్చెనమాట యీ తొందరలో నాకు జ్ఞప్తికే రాలేదు." అని పలికెను.

పోతన పకపకనవ్వుచు "ఒప్పుకొన్నాను, బావగారూ, ఒప్పుకొన్నాను. ఆర్తరక్షకుఁడగు పరమేశ్వరునకుఁ గూడ నార్తులపై నిటువంటి యనురాగమే యుండును. కనుకనే గజేంద్రుని దీనాలాపములు కర్ణములఁ బడినంతనే శ్రీమన్నారాయణుఁడు సిరికిఁజెప్పక, శంఖచక్రములు ధరింపక, పరువెత్తుకొనివచ్చినాఁడని నేను భాగవతములో వర్ణించితిని. అది యసందర్భముగా నున్నదని యింతకుముందే మీరు సూచించితిరి. ఇప్పటి మీ యనుభవమునుబట్టి నా వర్ణనము స్వభావసిద్ధముగనే యున్నదని భావింతును." అనెను.

శ్రీనాథుఁడు పోతనామాత్యుని వేళాకోళమును సమయోచితప్రవర్తనమును మెచ్చుకొనుచు వినమ్రవదనుఁడై "మహాకవీ! క్షమింపుము. నేనే పొరపడి యట్లు పలికితిని. భక్తశిఖామణివగు నీ భాగవతములో తప్పులెన్నుట మావంటి వారికి సాధ్యమా!" అని పలికెను.

౮

ఆ రాత్రి శ్రీనాథుఁడు తన సోదరి లక్ష్మితో నేకాంతముగ కొంతసేపు సంభాషించెను. లక్ష్మి కన్నీరుగార్చుచు నన్నగారితోఁ దమ దారిద్ర్యమును బరిపరివిధముల వర్ణించి చెప్పినది; భర్తగారి యుదాసీనభావమును విశదీకరించినది. దినము గడచుటయే కష్టముగా నున్నదని వాపోయినది. పెండ్లియీడువచ్చిన శారదను, మల్లన్ననుగూర్చి తన మనోవేదనను స్పష్టముచేసినది.

శ్రీనాథుఁడు సోదరిమాటలన్నియు వినినాఁడు. ఆయన హృదయము కరఁగిపోయినది. తన కేమి! భోగభాగ్యములతోఁ దులదూఁగుచున్నాఁడు; అందలములపైఁ దిరుగుచున్నాఁడు; కనకాభిషేకము లనుభవించుచున్నాఁడు; రాజసమ్మానము లందుచున్నాఁడు. తనవలెఁ దన బావగారైన పోతనామాత్యుఁడు సైతముండినఁ దనకెంత సంతోషముగా నుండును! తనసోదరి యెంత సుఖించును! సహజపాండిత్యుఁడై సరసకవితాకళానిధియైన బావగారు రాజాశ్రయమును నిరాకరించి 'తానుపట్టిన కుందేటికి మూఁడేకాళ్లని కూర్చున్నాఁడు. బావగారిమనస్సు మార్చినఁగాని లక్ష్మికాఁపురము చక్కఁబడదు. ఇట్లు కొంతసేపాలోచించుకొని కవిసార్వభౌముఁడు పోతనదగ్గరకుఁ బోయి మంచముపైఁ గూర్చుండి సానునయముగ నిట్లు పలికెను:

"బావా! నామాట పాటింపుము. కాఁపురములోని కష్టసుఖములను గమనింపుము. మా సోదరి దీనవదనమును

తిలకింపుము. నిరుపమాన కవితాధురంధరుఁడవే కాని నిన్ను నీవు తెలిసికొనలేకున్నావు. రాచకొండ ప్రభువైన సర్వజ్ఞసింగ భూపాలుఁడు సాహితీప్రియుఁడు, సరసకవితావిశారదుఁడు, సౌజన్యనిధి. నాతో రమ్ము. నేను నీ కాయన దర్శన మిప్పించెదను. నీ సంగతి మనవిచేసెదను. నీ మహాకావ్య మా మహారాజున కంకితము చేసితివా నీకుఁ గనకాభిషేకము జరుగును; సర్వసంపదలు సమకూరును. మీ కాఁపురము 'నిత్యకల్యాణము పచ్చతోరణము'గ నుండును. మీ పర్ణశాల స్వర్ణసౌధముగ మాఱును. మీ దారిద్ర్యమును తీఱును. నీ వాక్కు-మాటు తలయూఁపిన జాలును. మీ యిల్లు రత్న రాసులతో నిండిపోవును. ఆలోచించుకొనుము."

అనంతరము భోజనములైనవి. అందఱును శయనించిరి. పోతనామాత్యున కా రాత్రి నిద్దురపట్టలేదు. మాటిమాటికి శ్రీనాథుని పలుకు లాయన కర్ణములలోఁ బ్రతిధ్వనింపసాగినవి. దారిద్ర్యదేవత వికటాట్టహాసము చేయుచు జుట్టు విరఁబోసికొని నాట్యము చేయుచున్నట్లు కనుపించినది. మహారాజు లిచ్చు రత్నహారములు, బంగారు పతకములు కన్నులు మిఱుమిట్లు గొల్పినవి. మహాకవి మానస మొకింత చలించినది. ఆయన తన శిథిలకుటీరము వైపు చూచుచు నిమీలితనయనుఁ డయ్యెను.

సరస్వతీమూర్తి సాక్షాత్కరించినది. అదరిన హృదయముతో, బెదరిన నేత్రములతో, చెదరిన ముంగురులతో వాగ్దేవత సహజపాండిత్యుని మ్రోల సాక్షాత్కరించినది.

"అమ్మా! ఎవరు నీవు?"

"నేను వాణిని."

"నీ కనులవెంట బాష్పము లేమి తల్లీ! నీ చేతిలోని కచ్ఛపి జాఱిపోవుచున్న దేమి! నీ విసీలశిరోజములు చిక్కు-పడిన వే! ఎందులకమ్మా దుఃఖించుచున్నావు? 'బాలరసాలసాల నవపల్లవ' కోమలమైన నీ వదనము వాడుటకుఁ గారణ మేమమ్మా?"

"నీవే కారణము"

"నేనే కారణమా? అదేమిటమ్మా? నా వాగ్దేవత దుఃఖమునకు నేనే కారణమా?"

"అవును. మువ్మాటికి నీవే కారణము. నన్ను నరాంకిత మొనరింపఁ దలంచితివి. భాగవతమునుండి రామభద్రుని పేరు కొట్టివేసి యచ్చోట రాజులపేరు వ్రాయుదువా? చక్రవర్తులకుఁ జక్రవర్తియైన శ్రీరాముని విస్మరించి భోగముల కాసపడి నన్ను వీథులలో విక్రయింతువా?"

"లేదు, తల్లీ, లేదు. బావగారిపలుకులతో నొకింత పట్టుదల సడలిపోయి యాలోచించుచుంటిని; కాని, నా తల్లిని నరాంకిత మొనరింపను. అమ్మా! కవితాభారతీ! క్షమించు తల్లి! అవని క్రుంగినను, ఆకసము వంగినను నే నట్టి దుష్కార్య మొనరింపను. నా బంగారుతల్లీ! ని న్నెంత కష్టపెట్టితినమ్మా! ఇదిగో నా ప్రతిజ్ఞ వినుము.

"ఉ॥ కాటుకకంటినీరు చనుకట్టు పయింబడ నేలయేడ్చె దో
కైటభదైత్యమర్దనుని గాదిలికోడల, యోమదంబ, యో
హాటక గర్భురాణి! నిను నాఁకటికిం గొనిపోయి యల్లక
ర్ణాటకిరాటకీచకుల కమ్మఁ ద్రిశుద్ధిగ, నమ్మ భారతీ!"

అని మహాకవి యుత్తరీయాంచలముతో భాషావధూటి కన్నీటిని దుడిచినాఁడు. ధైర్యముచెప్పి యోదార్చినాఁడు.

తెల్లవాఱినది. శ్రీనాథుఁడు సపరివారముగఁ బ్రయాణమై "బావా! నేను సింగభూపాలుని యాస్థానమునకుఁ బోవుచున్నాను. మఱి భాగవతము విషయ మేమందువు?" అని హెచ్చరించెను. పోతనామాత్యుఁడు దృఢమైన కంఠస్వరముతో "కవిసార్వభౌమా! నన్నుఁ బదిం బది బలవంతపెట్టకుము. నా కంఠమున ప్రాణమున్నంత వఱకు నా పవిత్రభాగవతము నరాంకిత మొనర్పలేను. రాజ సన్మానములపై నా కాశలేదు. కనకాభిషేకములపై నాకుఁ గాంక్షలేదు. నేను కోరునది శ్రీవిభుని యనుగ్రహముకాని భూవిభుని యనుగ్రహముకాదు. ఇఁక నిట్టి ప్రసంగములతో నన్ను బాధింపవలదని బావగారిని బ్రార్థించుచున్నాను" అని ఖండితముగ బదులుచెప్పెను.

శ్రీనాథుఁడు మొగము చిన్నపుచ్చుకొని "సరే, కానిమ్ము. ఎవరికర్మమున కెవరు బాధ్యులు? మేము పోయివచ్చెదము" అని పలికి సోదరి నోదార్చి యంతేవాసులతోఁగూడి వెడలిపోయెను.

---

౯

సింగభూపాలుఁడు లలితకళాభిమానము కలవాఁడు. ఆయన కవులను, గాయకులను సన్మానించి కృతు లందుకొన్నాఁడు. పోతనమహాకవి భాగవతము రచించుచున్నాఁడని విన్నదిమొద లా మహాగ్రంథమును స్వనామాంకితముగా గ్రహింపనెంచినాఁడు. పోతనామాత్యునిగూర్చియు, పోతనామాత్యుని కవిత్వమునుగూర్చియు శ్రీనాథుఁ డెన్నో పర్యాయములు సింగభూపాలునియొద్దఁ బ్రశంసించినాఁడు.

సింగభూపతిహృదయములో కుతూహలము రేకెత్తినది. భాగవతమువంటి మహాగ్రంథమునకుఁ గృతిభర్త యగుటకంటె మహాభాగ్యము మఱేమున్నది?

సింగభూపాలుఁడు పెక్కుసార్లు రాజసభకు రమ్మని సహజపాండిత్యు నాహ్వానించినాఁడు. ఎన్నో సారులు శ్రీనాథునిచే వర్తమానములు పంపినాఁడు. కాని పోతన మహాకవి రాజసభకు రాలేదు. రాజునకుఁ గృతినిచ్చుట కంగీకరింపలేదు. మనుజేశ్వరుల భోగభాగ్యము లా మహాకవి మానసమును మార్చలేకపోయినవి. పోతన్న నెట్లైన లొంగఁ దీసికొనవలెనని చిట్టచివరకు సింగభూపాలుఁడు కృతనిశ్చయుఁ డయ్యెను.

తాను రాజు, ఏది తలఁచుకొన్న నది చేయఁగలఁడు. రేపు సూర్యోదయముననే యరిగి భాగవతగ్రంథమును బలవంతముగా స్వాధీనపఱుచుకొన్నఁ బోతన యేమి చేయఁగలఁడు?

అదే యాలోచన. ఆ రాత్రి సింగభూపాలుఁడు హంసతూలికా తల్పముపై శయనించి యుండెను. ఆయన మానస మాలోచనాతరంగములతో నల్లకల్లోలమైపోయెను. "కృతిప్రదానమునకు నిరాకృతియా? సింగభూపాలుని యాహ్వానమునకుఁ దిరస్కారమా? ఎంతసాహస మీ కవికి! తప్పదు! రేపే భాగవతమును గొనిరావలయును! కవి యభిమానమును గాలరాయవలయును."

అంతలో భూకాంతునికన్నులకు మిఱుమిట్లుగొలుపుచు నొక దివ్యకాంతి సాక్షాత్కరించినది. దేదీప్యమానమగు నా తేజోరాశిని గాంచినంతనే రాజేంద్రుని దేహము గడగడ వడఁకినది; గుండెలు దడదడ కొట్టుకొన్నవి; నోట మాట రాలేదు. ఆయన నిర్విణ్ణుఁడై యట్లే చూచుచుండెను. ఆతని కా వెలుఁగులో నొక వీరపురుషుఁడు కన్పించెను. ఆ పురుషుని శిరస్సుపై మణిమయకిరీటము విరాజిల్లుచున్నది. మెడలో వైజయంతి తేజరిల్లుచున్నది. ఆ మహాపురుషుని కరకమలములలో నొక మహాగ్రంథ మున్నది. ఆ గ్రంథరాజముపై ముత్యాలవంటి యక్షరములతో 'శ్రీమదాంధ్ర మహాభాగవతము' అని లిఖింపఁబడియున్నది.

సింగభూపాలుఁడు చకితుఁడై యా దివ్యమూర్తికిఁ జేతులు మోడ్చెను. "రాజా! మహాకవికి ద్రోహముచేయ నెంచితివా! అస్మన్నామాంకితమగు భాగవతమును బలవంతముగా గ్రహింపనెంచితివా! ఘోరము సుమా!" అను పలుకు లా తేజోమూర్తివదనకమలమునుండి వెలువడెను.

సింగభూపాలుఁడు భయకంపిత స్వరముతో "ప్రభూ! మీ యాజ్ఞ నా కర్థమైనది. మీ యాదేశ మవగతమైనది. పరమపురుషుని పవిత్రచరణసరోజముల కర్పించిన మహా భాగవతముపై దురాక్రమణ సేయఁదలఁచిన నన్ను మన్నింపుఁడు" అని పలికెను.

---

## ౧౦

ప్రభాతభేరి మ్రోఁగినది. సింగభూపాలుఁడు నిద్ర మేల్కొనినాఁడు. శ్రీరామభద్రునకు భాగవతమును సమర్పించు సందర్భములోఁ దాను స్వయముగఁ బాల్గొనెదనని మహాకవికి వర్తమాన మంపినాఁడు. ఆ మహోత్సవమును దానే నడపించెదనని ప్రార్థించినాఁడు.

ఆనాఁడు కృతిసమర్పణమహోత్సవము. ఏకశిలా నగరమంతయు నానావిధ మంగళతోరణములతో నలంకరింపఁబడినది. పౌరులందఱు ఫలపుష్పాదులు గైకొని కృతి ప్రధానమహోత్సవమునకు వచ్చుచుండిరి. మహారాజు మంగళ వాద్యములతో భాగవతగ్రంథమును బట్టపుటేనుఁగుపైఁ బెట్టి యూరంతయు నూరేఁగించెను. శ్రీనాథ పోతనామాత్యులు వికసితవదనులయి మహారాజుతోఁ గలసి నడచి వచ్చుచుండిరి. మల్లన్న, శారద నూత్నవస్త్రములు ధరించి మహోత్సాహముతో జనకు ననుసరించుచుండిరి.

ఎచ్చట జూచినను నవోత్సాహమే! ఏదిక్కు పరికించినను నుల్లాసభరితములగు సల్లాపములే! ఏప్రక్క విన్నను మధురమంజుల గీతికలే! ఏ గృహప్రాంగణము జూచినను మామిడాకు తోరణములే! ఎవని వదనము తిలకించినను దరహాసచంద్రికలే!

మహోత్సవము ముందుకు సాగిపోవుచున్నది. అసంఖ్యాకులగు పురజనులు సంతోషతరంగితాంతరంగములతో నడచిపోవుచున్నారు. క్రమముగా మహోత్సవము శ్రీ కోదండరామాలయము చేరినది. మహాకవి దంతావళముపైనుండి భాగవతమును మెల్లగాఁ గ్రిందికి దింపినాఁడు. తన జీవితసర్వస్వమగు నా కావ్యఫలమును భద్రముగా భక్తిపూర్వకముగాఁ బాణిపద్మములతోఁ బట్టుకొని దేవాలయమునఁ బ్రవేశించినాఁడు. జయజయనినాదములు మిన్నుముట్టినవి.

పోతనామాత్యుఁడు శ్రీరామభద్రుని చరణారవిందములకుఁ బ్రణమిల్లినాఁడు. సర్వజనసమక్షమున దేవదేవునికి భాగవతమును సమర్పించినాఁడు. శ్రీనాథ సింగభూపాలురు శిరస్సులువంచి చేతులుమోడ్చి శ్రీరామునకు నమస్కరించినారు. శారద యా మహానందములో మైమఱచిపోయినది. లక్ష్మి పుష్పహారము లర్పించినది. పోతనామాత్యుని నేత్రములానందబాష్పములు రాల్చినవి.

మహాకవి మనోరథము సఫలీకృతమైనది. ఆయన జీవితము కృతార్థమైనది. కవిసార్వభౌముఁడు గద్దించినను,

మహారాజు లాహ్వానించినను, భాగ్యదేవత కన్నుగొట్టినను, దారిద్ర్యపిశాచము తాండవించినను మహాకవి చలింపలేదు.

పోతన ధన్యజీవి. ఆయన భాగవత మాంధ్రభాషామ తల్లి కమూల్యాలంకారము.

మహాకవీ! నమోవాకములు!

భక్తశిరోమణీ! ధన్యవాదములు!

